# వేములవాడభీమకవి చరిత్ర.

గ్రంథకర్త:

జొన్నలగడ్డ వేంకట రాధాకృష్ణయ్య.



రెండవ కూర్పు 1250 ప్రతులు.

ప్రకాశకుడు:

కొండపల్లి వీరవెంకయ్య

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో.,

రాజమండ్రి.

శ్రీ చింతామణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

రాజమండ్రి.

1938.



[వెల రు. 0—12—0.

# విషయసూచిక



ఓం

శ్రీ రా మా య న మః

అ వి ఘ్న మ స్తు

# వే ము ల వా డ భీ మ క వి.



## 1 జన్మవృత్తాంతము

వేములవాడ భీమకవి క్రీ. శ. ౧౦౬౮ సం॥రమున గోదావరీ మండలములోని ద్రాక్షారామ మనుపుణ్యక్షేత్రమునకు నాలుగైదు క్రోశముల దూరములోనున్న వేములవాడ యనుగ్రామమున జన్మించెను. ఈతనితండ్రి సోమనాధామాత్యుఁడను నియోగిబ్రాహ్మణుఁడు. పాప మాతఁడు సంతానలబ్ధికై పెక్కుదానధర్మము లొనర్చినను ప్రయోజనము లేకపోయెను. సంతానాపేక్షతో నతఁడైదుగురు భార్యలతోఁ గాపురముచేసి తుదకు పరమపదము నొందెను.

ఇట్లుండఁగా నాసోమనాధుని భార్యలందరును క్షయ సం॥ రం మాఘశుద్ధ పౌర్ణమీ శుక్రవారమునాఁడు ద్రాక్షారామ భీమేశ్వరుని సేవింపనేగిరి. ఆనాఁడు దేవాలయము తీర్థయాత్రికులతోఁ గ్రిక్కిరిసి యుండెను. సోమనాధునిభార్యలు సప్తగోదావరీ స్నానమాచరించి భీమేశ్వరుని దివ్యమూర్తిని దర్శించి, తమకేజన్మమునను వైధవ్య దుఃఖము గలుగకుండునట్లు వరము ప్రసాదింపుమని కోరుకొనిరి. అందఱిలోను దుదిభార్యయగు మాచమ్మ తనసవతులతోఁ గలిసిపోక, సువాసినులందఱు నున్నయెడకరిగి, అమాయిక లగుటచే వారందఱి

వలెనే తనకు సంతానముఁ బ్రసాదింపుమని మ్రొక్కుకొనియెను. ఆమె ప్రక్కనున్న సువాసినులామె మాటల నాలకించి పక్కున నవ్విరి.

భీమేశ్వరుని కరుణాకటాక్షమున మాచమ్మ గర్భవతియై శాలివాహన శకము ౧౦౬౮ సం॥రమునకు సరియైన ప్రభవ సం॥ర శ్రావణ శు ౮ శుక్రవారమునాడు భీమకవినిగనెను. మాచమ్మ వితంతువై పుత్రుని గాంచుటచే, దక్కినసవతులును, ఊరిలోనివారును పలువిధముల నిందింపసాగిరి. ఆమెను వెలివేసిరి. వ్యభిచారిణి యనిగేలిచేసిరి. మాచమ్మ ఆనిందలను లెక్కసేయలేదు. కుమారుని పెంచి పెద్దవానినిచేసెను. తన కుమారున కుపనయనముఁ జేయవలయునని యామె విశ్వప్రయత్నము చేసెను గాని ఎవ్వరును పూనుకొనరైరి. భీమన్న పదునాలుగువర్షముల ప్రాయముఁగలవాఁడై, తనతోడి బాలురందఱిలో నన్నివిషయము లందును మిన్నయని పేరొందెను. ఆబాలురు భీమన్నయెడ మత్సర గ్రస్తులై, మహాబలాఢ్యుఁడగు నాతనినేమియుఁ జేయఁజాలక, రండా పుత్రుఁడని దూషింపసాగిరి. ప్రపంచజ్ఞానము తెలిసికొన్న భీమన్న తన్నెవరును భోజనమునకుఁ బిలువకుండుటయుఁ, దనమిత్రులు వ్యభిచారిణీ కుమారుఁడని యుపహాస్యముచేయుటయుఁ జూచి, కుపితుఁడై యొకనాడు తల్లిని సమీపించి 'అమ్మా! నన్నెవరును భోజనమునకుఁ బిలుచుటలేదు. పైగా స్నేహితులు రండాపుత్రుడని పరిహసించు చున్నారు. కారణమేమో జెప్పెదవా లేదా' యని గద్దించి యడిగెను.

మాచమ్మ 'నాయనా! నన్ను నిర్బంధించి ప్రశ్నించిన నేనేమని చెప్పఁగలను? తిన్నగా ద్రాక్షారామమున కరిగి, భీమేశ్వరుని దర్శన మొనరించి, యాస్వామినే నీజననరహస్యమును దెలుపుమని యడుగు' మనెను. భీమన్న తిన్నగా ద్రాక్షారామ భీమేశ్వరుని సన్నిధికేఁ జని, 'దేవా! నేను రండాపుత్రుఁడనని యెల్లరు నపహసించుచున్నారు.

నాకేమియు బోధపడకున్నది. ఇందులకుఁ దగినసమాధానమిచ్చి నామన స్సంతాపముఁ బాపెదవాలేదా ?' యని ప్రశ్నించెను. ద్రాక్షారామ భీమేశ్వరుఁడు భీమన్నకు సాక్షాత్కరించి 'వత్సా ! నీపైఁ బ్రజలు మోపునపవాదము నిరాధారమైనది. నాయనుగ్రహమున జన్మించిన వాఁడవు సకలశాస్త్రపారంగతుఁడవై కవిత్వముఁజెప్పి, జగదేకవిఖ్యాతిఁ గాంతువు. నీవేమన్న నదిచెల్లును. రాజసన్మానము పొందుదువు. ప్రజలు నిశ్శంక నేమియుననరు.' అని చెప్పెను.

ఇవ్విధమున నాశీస్సులఁబొంది, భీమన్న యింటికివెళ్ళెను. ఆతని బంధువుఁడగు వేములవాడ యనుగ్రామామాత్యుఁ డుపనయనముఁ జేసెను. భీమన్న నాఁటగోలె శాస్త్రములఁ జదివి, కవిత్వము నలవఱచుకొనెను.

---

## 2. సంతర్పణ.

ఒకనాఁడు వేములవాడలో నొకవిప్రుఁడు బ్రాహ్మణులకు సంతర్పణముచేసెను. ఊరిలోని బ్రాహ్మణులందఱును ఆహ్వానింపఁబడిరి. పాప మొక్క-భీమకవిని మాత్రి మాసమారాధనమొనరించు బ్రాహ్మణుఁడు భోజనమునకుఁ బిలువలేదు. భీమకవికిఁ జాలకష్టముగ నుండెను. 'సంతర్పణకూరిలోనివా రెల్లరువెళ్ళగా నేనెందులకు వెళ్ళగూడదు ?' అని తలంచి, భీమకవి యెవరును బిలువకుండగనే వెడలెను. అచ్చట నున్నబ్రాహ్మణులు భోజనములకై కూర్చుండి యుండిరి. భీమకవిని జూచి వారు 'ఓయీ ! నీకిచ్చట చోటులేదు. వెలివేయఁబడిన నిన్నె వరు పిలిచిరి ? పొమ్ము.' అని కసరికొట్టిరి. సమారాధనమొనరించు బ్రాహ్మణుఁడుకూడ తిరస్కరించెను. భీమకవి క్రోధోన్మత్తుఁడై పందిరినుండి యీవలికివచ్చి

ఉ. గొప్పలుసెప్పుకొందు ననుఁగూటికిఁ బాత్రికిఁ గాకుమంచునీ
త్రిప్పుడు బాపలందఱును దిట్టిరిగావున నొక్కమాఱిమా
యప్పములన్ని కప్పలయి యన్నమునున్నముగాఁగ మాఱుతన్.
బప్పునుశాకముల్ పులుసుఁ బచ్చడులున్ జెఱురాలుగావుతన్.

అని చదివెను. భీమకవి యట్లు చదివినంతనే ఆ యన్నమంతయు సున్నమైపోవుటయు, అప్పములు కప్పలై బెకబెకలాడుచు గంతులువేయుటయు జరిగెను. బ్రాహ్మణులందఱును మహాకలవరము నొందిరి. భీమకవి శాపవుఁబద్యమును విన్నయొక బ్రాహ్మణుఁడు "మిత్రులారా! భీమకవియే యింతులకుఁ గారకుఁడు. అతనిని ప్రార్థించుట కర్తవ్య" మనెను. అందఱును వెళ్ళి భీమకవి పాదములపైఁబడి తమ తప్పిదము క్షమించి భోజనమునకు రమ్మని బ్రతిమాలిరి.

ఆ పాఱులయెడ జాలివహించినవాఁడై భీమకవి,
"మ. ఘనుఁడా వేములవాఁడ వంశజుఁడు ద్రాక్షారామభీమేశనం
దనుఁ డీభీమనయంచు కుత్తెఱిఁగి, నిందల్ మానినన్ గౌరవం
బునసీ విప్రులుచూచి రందువలనన్ బూర్వస్థితిన్ జెంది భో
జనవస్తుప్రకరంబులన్నియు యథావస్థంబు కాఁగావుతన్."

అని చదివెను; సున్నముగా మాఱిన యన్నము స్వస్వరూపముఁ జెందెను. కప్పలై గంతులిడుచున్న యప్పములును దమతొల్లిటి రూపముఁ జెందెను. బ్రాహ్మణులెల్లరును భీమకవియెడ భయభక్తులు కలిగి మెలఁగసాగిరి. సమారాధన మొనరించిన ద్విజన్ముఁడు తన్నాతఁ డేమని శపించునో యనిగజగజ లాడిపోవుచుండెను. అది గ్రహించి భీమకవి యాభూసురుని మన్నించి, యీపద్యము జదివెను—

సీ. గడియలోపలఁ దాడిఁగడఁగి ముత్తునియగా,
దిట్టినమేధావి భట్టుకంటె

## వేములవాడ భీమకవిచరిత్ర.

ఉ. గొప్పలుసెప్పుకొంచు ననుఁగూటికిఁ బంక్తికిరాకుమంచునీ
త్రిప్పుడు బాపలందఱును దిట్టిరిగావున నొక్క—మాఱిదీ
యప్పములన్ని కప్పలయి యన్నమునున్నముగాఁగ మాఱుచున్.

బప్పునుశాకముల్ పులుసుఁ బచ్చడులున్ జిఱురాలుగావుతన్.

అని చదివెను. భీమకవి యట్లు చదివినంతనే ఆ యన్నమంతయు సున్నమైపోవుటయు, అప్పములు కప్పలై బెకబెకలాడుచు గంతులువేయుటయు జరిగెను. బ్రాహ్మణులందఱును మహాకలవరము నొందిరి. భీమకవి శాపపుఁ బద్యమును విన్నయొక బ్రాహ్మణుఁడు "మిత్రులారా! భీమకవియే యిందులకుఁ గారకుఁడు. అతనిని ప్రార్థించుట కర్తవ్య"మనెను అందఱును వెళ్ళి భీమకవి పాదములపైఁబడి తమ తప్పిదము క్షమించి భోజనమునకు రమ్మని బ్రతిమాలిరి.

ఆ పాఱులయెడ జాలివహించినవాఁడై భీమకవి,

"మ. ఘనుఁడౌ వేములవాఁడ వంశజుఁడు ద్రాక్షారామభీమేశనం
దనుఁ డీభీమనయంచు కుర్తెఱిఁగి, నిందల్ మానినన్ గౌరవం
బుననీ విప్రులుచూచి రందువలనన్ బూర్వస్థితిన్ జెంది భో
జనవస్తుప్రకరంబులన్నియు యథాస్వస్థంబు కాఁగావుతన్."

అని చదివెను; సున్నముగా మాఱిన యన్నము స్వస్వరూపముఁ జెందెను. కప్పలై గంతులిడుచున్న యప్పములును దమతొల్లిటి రూపముఁ జెందెను. బ్రాహ్మణులెల్లరును భీమకవియెడ భయభక్తులు కలిగి మెలఁగసాగిరి. సమారాధన మొనరించిన ద్విజన్ముఁడు తన్నెతఁ డేమని శపించునో యనిగజగజ లాడిపోవుచుండెను. అది గ్రహించి భీమకవి యాభూసురుని మన్నించి, యీపద్యము జదివెను—

సీ. గడియలోపలఁ దాడిఁగడఁగి ముత్తునియగా,
దిట్టినమేధావి భట్టుకంటె

రెండుగడెలబ్రహ్మ దండిముండ్లన్నియు
దుల్లఁదిట్టిన కవిమల్లుకంటె
మూఁడు గడియలకు మొనసియత్తినగండి
పగులఁదిట్టిన కవిభానుకంటె
నఱజాములోపలఁ జెఱువు నీళ్లింకంగఁ
దిట్టిన బడబాగ్ని భట్టుకంటె
గీ. నుగ్రకోపినేను నోవుదు శపియింప
గ్రిమ్మఱింప శక్తి కలదునాకు
వట్టిమ్రానఁ జిగురు పుట్టింపగిట్టింప
శారు వేములవాడ భీమకవిని.

నాఁటినుండి భీమకవియశస్సు నలుగడలవ్యాపింపసాగెను శాపమొసంగుటకు నుపసంహరించుకొనుటకుఁ గూడ శక్తిగల భీమకవి కవిత్వము కూడ మిక్కిలి పటిమకలిగి యుండుటచే రాజులుకూడ నీతని నాహ్వానింపసాగిరి. ఈతఁడు తనకుఁ బదునెన్మిది సంవత్సరములవయస్సు వచ్చు పర్యంతము నెచ్చటికినిఁ బోలేదు. రాజుల సందర్శించు కుతూహలము భీమకవికిఁ గూడ జనింప, నాతఁడు మొదట సాగి పోతరాజును దర్శింపఁ బోయెను.

---

# 3 సాగి పోతరాజు

వేములవాఁడ భీమకవి హూణశకము ౧౦౩౮ సం॥రమున సుప్రసిద్ధమైన పెద్దాపురము వత్సవాయవారి కుటుంబపు మూలపురుషుఁడై నసాగి యెఱపోతరాజును కుమారుఁడగు తెలుగురాయని దర్శింప, కృష్ణామండలస్థమైన గుడిమెట్టకుఁ బోయెను. ఈగుడిమెట్ట నందిగామ

గనతిదూరమున నున్నది. సాగి యెఱపోతరాజునకుఁ దెలుంగురాయఁ డను కుమారుఁడు కలఁడు. ఆ కాలమునఁ బ్రయాణసౌకర్యము లెవ్వియు నంతగా లేనందున భీమకవి యొక్క యశ్వముపైఁ బయనము సలిపెను. ఆహయము ప్రథమమున నెఱపోతరాజుచే సింధురాష్ట్రము నుండి తెప్పింపఁబడి, మార్గముతప్పిపోయి యెట్లో యొకశూద్రునకుఁ జిక్కి, ఆశూద్రునిచే ద్రాక్షారామ భీమేశ్వరునకు సమర్పింపఁబడెను. భీమకవి యాఘోటకము నెక్కి, గుడిమెట్టకుఁ జనెను.

భీమకవి భోజనార్థమరిగి యున్నసమయమునఁ బోతరాజు ఆగుఱ్ఱమును గుర్తించి తనయశ్వశాలకుఁ దోలుకొనిపోయెను. భోజ నానంతరము భీమకవి వచ్చిచూడఁగా హయము లేకుండెను. రాహుత్తు మారుఁడను నొకటరి "అయ్యా! మీ యశ్వమును తెలుంగు రాయఁడు తోలుకొనిపోయెను." అని చెప్పెను పోతరాజు పినతండ్రి కుమారుఁడు లక్ష్మీపతిరాజును గలిసికొని, తనయశ్వము నిప్పింపుమని కోరెను లక్ష్మీపతిరాజును భయకంపితుఁడై, పోతరాజుకడకేగి "అన్నా! భీమకవి కోపి. అతని గుర్రమునిచ్చివేయుము. లేకున్న నీవంగడము నాశమైపోవునట్లు శపియించును జుమా" అనిచెప్పెను.

పోతరాజు వినలేదు. "నాయశ్వమది. భీమకవిది కాదు. ఏమైనను సరే నేనీయ" నని ఖండితముగాఁ జెప్పెను. భీమకవి యాలోచించి, పదిసార్లు కబురంపినను, పోతరా జీయకొననందునఁ గుపితుఁడై యీపద్యముఁ జదివెను—

చ. హయమది సీత ; పోతవసుధాధిపుఁ డారయరావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ; సహ్యజవారధి; మారుఁడంజనీ
ప్రియతనయుండు, లచ్చన విభీషణుఁ డీగుడిమెట్ట లంక; నా
జయమును బోతరక్కసుని చావును నేఁడవనాఁడు చూడుఁడీ.

భీమకవి మాట యూరకపోలేదు. ఏఁడవనాఁడు పోతరాజు మృతినొం

దెను. పోతరాజు మరణానంతర మాతనిపుత్రులూను, లక్ష్మీపతిరాజును రాజ్యపదవికొఱకుఁ గలహింపఁ నారంభించిరి. కుడిమెట్ట లక్ష్మీపతిరాజు వశమాయెను. తెలుఁగురాయఁడు పెద్దాపురమునకువచ్చి, యచ్చట రాజ్యసంస్థాపనము చేసెను భీమకవి పెద్దాపురమునకరిగెను. తెలుఁగు రాయఁడు భీమకవి రాకనెఱింగి, గౌరవపురస్సరముగా నాకవి నాహ్వా నించెను. భీమకవి తెలుంగురాయని కొలువుకూటమున కరిగి, యిట్లు చదివెను

మ. ఘనుఁడన్ వేములవాడవంశజుఁడ దాక్షారామ భీమేశనం
దనుఁడన్ దివ్యవిషామృత ప్రకట నానాకావ్యధుర్యుఁడ, భీ
మన నా నామమెఱుంగబల్కితిఁ దెలుంగాధీశ! కస్తూరికాఘన
సారాది సుగంధవస్తువులు వేగందెచ్చి లాలింపురా.

ఇట్లనుటతోడనే తెలుంగురాయఁడు వానినన్నింటిని దెప్పించి, పూజించి చాలధనమిచ్చి బహూకరించెను. తానెంత ద్రవ్యము సేకరించినను భీమకవి యజ్ఞములకే వినియోగించుచుండెను. అందులకే ఆతని సమ కాలికులగు కవులు 'కవిరాత్మునుయింట ఘనమైన యజ్ఞంబు జరుగు పోదమురందు జాగదేల?' అని వ్రాసిరి.

---

## 4. కోమట్లు.

వేములవాడ భీమకవి యొకనాఁడు రాజమహేంద్రవరమున కేగెను. రాజరాజనరేంద్రునికడనున్న నన్నయభట్టారకునకు నీతనికి శత్రు భావముండుటచే భీమకవి రాజనరేంద్రుని సందర్శింపఁ దలంపక వెడలి పోఁదలచెను. ఆ రోజున నీకవి నెవ్వరును భోజనమునకైనఁ బిలువక పోవుటచేఁ గోమటియింట వెచ్చములన్నియుఁ గొని, తానే వంటచేసి కొనవలసివచ్చెను.

వెచ్చములకొఱకై భీమకవి కోమటిని దుకాణముకడ కరిగి బియ్యము పప్పు మున్నగునవి యిమ్మనఁగా నాతఁడందఱికి విక్రయించు ధరలకంటె రెండురెట్లెక్కువ వెలలఁ జెప్పసాగెను. 'ఇదియేమి యన్యాయ మయ్యా' యని గురునాథుఁడు ప్రశ్నింప నాకోమటి 'నాకిష్టమైనట్లు నేనమ్ముకొందును. నీకిష్టమున్నఁ గొనుము. లేనిచో మాను' మని గర్జించెను. భీమకవి యాగ్రహావేశ వివశుఁడై యీక్రింది పద్యములఁ జదివెను.

మ. కొనకొనిమర్త్యలోకమునఁ గోమటిపుట్టఁగఁ దోడఁబుట్టె బొం
కును గపటంబులాలనయుఁ గుత్సితబుద్ధియు రిక్తభక్తియుఁ
జనిమిఱిమాటలున్ పరధనంబును గ్రక్కున నొక్కఁ జూచుటల్
కొనుటయు నమ్ముటల్ మిగులఁ గొంటుతనంబును మూర్ఖవాదముల్.

ఉ. కోమటి కొక్కటిచ్చి పదికొన్నను దోషములేదయింటికిన్
సేమమెఱింగి చిచ్చిడినఁ జెందదుపాపము వానినెప్పుడే
నేమరుపాటునన్ మఱియు నేమి యొనర్చిన లేదుదోసమూ
భీముని లింగమాన, కవిభీమునిపల్కులునమ్మియుండుఁడీ.

ఉ. రాము నమోఘబాణమును రాజశిఖామణి కంటిమంటయున్
భీము గదావిజృంభణ మహేంద్రుని వజ్రము చక్రిచక్రమున్
దామరచూలి వ్రాయుత యుదారకవిద్విషు ఘోరశక్తియున్
వేములవాడ భీమకవివీరుని తిట్టును రిత్తవోవునే.

కోమటి యీ పద్యముల నాకర్ణించి, భీతచిత్తుఁడై భీమకవికి వలయుఁ బదార్థములను వెలఁగొనకయే యిచ్చి తనయవజ్ఞత సైరింపు మని వేఁడుకొనియెను.

## 5. జన్నమాంబ.

వేములవాడ భీమకవి యొకప్పు డొకకుగ్రామమునకుఁ బోయి, యాపూట భోజనము నెచ్చటచేయుటకును దొరకక యిట్టటుతిరిగి యొక యింటిగుమ్మములో నిలిచియున్న జన్నమాంబ యను వితంతువును జూచి "అమ్మా! భోజనముఁ జేసిపెట్టెదవా?" యనియడిగెను. ఆవితంతువు "నాయనా! నాకంఠముపై వ్రణమై మిక్కిలిబాధ పెట్టుచున్నది. నాకోపికలేదు." అనెను, భీమకవి మఱల నామె నుద్దేశించి "అమ్మా! ఆవ్రణమును నేనుఁబోగొట్టెదను వండిపెట్టెదవా?" యని మఱల ప్రశ్నించెను.

"వ్రణముఁ బోఁగొట్టిన వండిపెట్టకేమి నాయనా? ఇంతే భోజనముపెట్టినఁ బాపమువచ్చునా?" యని యావితంతువు బదులు పలికెను. భీమకవి వెంటనే—

క. ఘనరోగంబుల బలమా
   కనుఁగొనగా జన్నమాంబ కర్మవుఫలమా!
   నినుఁ బ్రార్థించెద వినుమీ
   మునుకొని యోగండమాల మునఁగకుఁజనుమా.

అని పద్యము చదువునరికా విధవకంఠముమీఁది వ్రణము సమీపమున నున్న మునఁగచెట్టున కంటుకొనెను. బాధానివృత్తినొందిన జన్నమాంబ మహదానంద భరితాత్మయై భీమకవికి వంటఁజేసిపెట్టెను.

భీమకవి కొన్నాళ్ళయినపిదప మఱల నా కుగ్రామమున కరిగి జన్నమాంబ యింటికేవెళ్లి భోజనముపెట్టుమనియెను. ఆమె "నాకిదేపనియా నాయనా! నావల్లకాదు" అని నిర్భాగ్యయోటముగాఁ జెప్పెను. భీమకవి కోపోద్రిక్తుఁడై

గీ. మున్ను జన్నమాంబ మునుకొనియుంటివి
యేను బొమ్మటన్న యీవుజన్న
ముండ యేరుగడచి ముదిపెండ్లికతసేసె
మునగగండమాల ముండఁబట్టు.

ఆ. ఏను భీమకవిని యిదె నిన్ను బ్రార్థింతు
మునువు నీవువచ్చి ముండఁబట్టి
మునగకొండయయ్యె మునుపటిరీతిని
మునగ గండమాల ముండఁబట్టు.

అని చదువగా నా వితంతువు కంఠ మెప్పటివలె వ్రణము కలదయ్యెను.

---

## 6. రాజకళింగగంగు.

కళింగదేశాధిపతి యగు గంగరాజునకు రాజకళింగగంగు అను నామాంతరము కూడకలదు. ఈతని వంశమునకు మూలపురుషుఁడు దానార్ణవుఁడు. ఈతనికిఁ గామార్ణవుఁడను తనయుఁడును యీకామార్ణవునకు రణార్ణవుఁడను తనూజుఁ డుదయించెను. కామార్ణవుని యనంతరము కుణార్ణవుఁడు రాజ్యపరిపాలనము చేయసాగెను. కుణార్ణవుని కుమారుఁడు వజ్రహస్తుఁడు. వజ్రహస్తుని కుమారుఁడు కామార్ణవుఁడు. ఈతని కుదయించిన రాజరాజు కులోత్తుంగ చోడదేవుని కొమరితను పెండ్లియాడెను. ఈ యిరువురికి నుద్భవించిన గంగరాజే రాజకళింగగఁగు.

ఈ రాజేంద్రుఁడు దానకర్ణుఁడని వాసిఁగాంచెను. వేములవాడ భీమకవి యొకప్పుడీ రాజకళింగగఁగును సందర్శింప పిజ్జనగరమునకుఁ బోయెను. కవిరాక్షసుం డరుదెంచెనని తెలిసియు రాజకళింగగంగు అహ్వానింపఁడాయెను. మఱునాఁడు భీమకవి రాజసన్నిధానమునకుఁ

బోయెను. రాజు భీమకవిని గౌరవించి యుచితాసనమునఁ గూర్చుండఁ జేసి, రాజకీయవ్యవహారములఁ జూచుకొనుచుండెను. ఆరాజవతంసునిపైఁ బద్యముచదివి బహుమానమునొంది పోవుదమని వేచియుండెను. ఎంతసేపు నిరీక్షించియున్నను రాజకళింగగం గవకాశము నొసంగఁ డయ్యెను. భీమకవికి విసుగుజనింప, నిట్లుచదివెను—

ఉ. వేములవాడయందు ఘనవిశ్రుతకీర్తిఁ జెలంగనందఱున్
భీమకవీంద్రుఁడంచు ననుఁ బెద్దగసన్నుతిఁ జేయసజ్జన
స్తోమములెల్ల నంతసిల దుర్జనులెల్లను భీతినొందఁగాఁ
బ్రేమను దక్షవాటిపుర భీమకృపాపరిలబ్ధతేజుఁడన్

ఉ. చెప్పెదనింపుగాఁ గవితశ్రేష్ఠవచఃపరిగమ్య మానమై
యొప్పఁగ మంచిచెడ్డగను నోగునుబాగగునట్లుగా మఱిన్
గొప్పను గొద్దిగాఁ దగిలి కొద్దిపదార్థము గొప్పసేయునా
కెవ్వడు శక్తిగల్గు జగధీశ్వర నానుడులాలకింపుమా.

రాజకళింగగంగు భయపడి 'ఆర్యోత్తమా! రాజ్యాంగ వ్యవహారనిమగ్నుఁడనై యున్నాను. నాకుఁ దీఱికలేదు సందడితీఱిన పిదప నెప్పుడైన రమ్ము. అపుడు నిన్ను సత్కరింతు' ననెను. ఈమాటలు భీమకవికి మఱింతకోపకారణము లయ్యెను. 'నాపద్య మొకటి వినుటయే నీకుఁ గష్టమైనదా? ఈమాత్రమునకే సందడితీఱిన వెనుక రావలయునా? ఇదిగో విను' మని భీమకవి యీపద్యముఁ జదివెను—

ఉ. వేములవాడ భీమకవివేగమెచూచి కళింగగంగు తా
సామముమాని కోపమున సందడితీరినరమ్ము పొమ్మనెన్
మోమును జూడఁగూడదిక ముప్పదిరెండు దినంబులావలన్
జామునకర్థమందతనిసంపద శత్రులపాలు గావుతన్.

రాజ కళింగగంగు హృదయము భయకంపితమయ్యెను. వంగ దేశాధినాథుఁడు విక్రమదేవుఁడు ప్రిచండసైన్యసమేతుఁడై పెజ్జ నగరమును ముట్టడించెను. రాజ కళింగగంగు ధైర్యసాహసములతోఁ బోరియు నోడిపోయెను విక్రమదేవుని ప్రధానుఁడగు సిరియాళుఁడు రాజ్యపరిపాలనాధికారము వహించి, కడుఁగొన్న రాజ కళింగగంగును బంధవిముక్తుఁ గావించి ' నీ వెచ్చటికైనఁబోయి బ్రతుకుము. మఱల నీదేశములోనికిఁ దరిగి రాకుము. జాగ్రత్త ' అని చెప్పెను. రాజ కళింగగంగు దేశమును విడిచి, తిండికిఁగూడ నిబ్బందిపడుచు దూరదేశమునకుఁ బోయెను. అతని భార్యలకుఁ గుటుంబపోషణమునకు గుర్వ్యయముు సిరియాళుఁ డొసఁగుచుండెను

ఊరూరఁ దిరుగుచుఁ గళింగగంగు పెద్దాపురముం జేరి రాత్రులందు మాధుకరమెత్తుకొని జీవించుచుండెను. వత్సవాయి తెలుంగు రాయని సందర్శింపఁ దలంచి, వేములవాడ భీమకవి యొకనాఁడు పెద్దాపురమున కరిగి, బంధుగుల యింటికి వెళ్ళి భోజనమొనరించి, చేయికడుగుకొనుట కీవలకు వచ్చునరికి రాజ కళింగగంగా మార్గముననే వచ్చుచు చీఁకటిచే మార్గము కానరాక గోతిలోఁబడెను ' అయ్యో ! దివ్వెటి యైనలేదే ' అని కళింగ గంగనుకొనుటవిని భీమకవి ' బిచ్చగానికి దివిటీ యెట్లువచ్చును ? ఎవరు నీవు ? ' అని ప్రశ్నించెను.

' వేములవాడ భీమకవిచేసిన బికారి ' నని రాజ కళింగగంగు సమాధాన మొసంగెను. భీమకవి విస్మయపరీతచేతస్కుఁడై యాతని గుర్తించి 'అయ్యో ! కళింగరాజ్యాధిపుఁడు నాశాపము నొంది యెంతదుర్గతికి లోనైనాఁడు ? ఈతనికి రాజ్యపదవి ప్రాప్తించునట్లు చేసెద ' నని తలంచి, ' ఓయీ ! ఇటురమ్ము. ' అని భోజనము పెట్టించి యాతఁడు స్వస్థుఁడైన పిదప నీపద్యముఁజదివెను—

ఉ. వేయి గజంబులుండఁ బదివేలతురంగములుండ నాజిలో
రాయలగెల్చి సజ్జనగరంబునఁ బట్టముగట్టుకోవడిన్
రాయకళింగగంగు! కవిరాజభయంకరమూర్తిఁ జూడఁగా
బోయిన మాసమాసమునఁ బున్నమపోయిన మర్నినాఁటికిన్.

రాజ కళింగగంగు చకితుఁడై "మహాత్మా! అపరాధిని క్షమింపుఁడు." అని చాలసేపు మాట్లాడి యాకవిచెప్పిన చొప్పున సజ్జనగరమునకుఁ బోయెను. ఆతని శిరోజములు, గడ్డము బాగుగా పెరిగియున్నందున నెవరును ఆనవాలు పట్టజాలకుండిరి. పాప మాతఁడు దుఃఖభరమున కృంగిపోయెను. కష్టపరంపరాఘాతమున నాతని మేను కృశీభూతమైపోయెను.

కళింగదేశమును మంత్రియై రాజ్యభారము వహించియున్న సిరియాళుఁడు మంత్రిత్వమునొల్లక కాననభూములఁ జరింపఁబోయెను. తన జ్యేష్ఠతనూభవుని రాజ్యమును బాలింప నియమించి, వంగరాష్ట్రాధిపతి విక్రమదేవుఁడు సజ్జనగరమున కేతెంచి, కళింగరాజ్యపరిపాలన మొనరింపసాగెను. ఆతనికిఁ బగటివేషములన్నను, నాటకములన్నను బ్రీతిమెండు. ఒకనాఁడు రాజేంద్రుని వినోదింపఁ జేయుటకై యావగటి వేషగాండ్రరుదెంచిరి. వారు రోజుకొక వేషమువేయుచు, విక్రమదేవు నానందింపఁ జేయుచుండిరి. విక్రమదేవుఁ డొకనాఁడు వారినిచూచి "మీరు నావేషము వేయఁగలరా?" యని యడుగ వారు "సరే. అట్లేవేసెద" మని యంగీకరించిరి. మఱుచటి దివసమున ఆవేషగాండ్రు విక్రమదేవు వేషమువేసి, రాజును మెప్పించిరి. విక్రమదేవు పరమానందభరితాత్ముఁడై "సరే! బాగున్నది. మీరు రేపు రాజ కళింగ గంగు వేషము వేయవలయు" నని చెప్పఁగా నావేషగాండ్రు "ప్రభూ! మేమెన్నఁడును రాజ కళింగగంగును చూచియుండలేదు. మాసముదినములు గడువీయవలయు" నని కోరిరి.

రాజ కళింగగంగు చాల శీవి గలవాఁడని వినియున్న యావేష గాండ్రకు ఆందోళన ముదయించెను. వారి నాయకుఁ డిందఱిని తరిఫీజు చేయసాగెను గాని యెవ్వరును సమర్థతతో నావేషము నభినయింతురని తోఁచలేదు. గడువుదినము సమీపించినకొలఁదిని నాయకుని చిత్తమునఁ గలవరమధికము కాసాగెను. అతఁడు ఏవేషగాఁడైనను రాజ కళింగ గంగు వేషము వేయుచోఁ జాలధనమిచ్చెద” నని ప్రకటించెను. ఆ చాటింపు రాజ కళింగగంగు వినులఁబడెను. అతఁడు వెంటనే యా వేషగాండ్రకడ కరిగి, తానావేషము ధరింపఁగలనని చెప్పెను. నాయకుఁడు సంతసించి, రాజ కళింగగంగు ధరించియున్న మలినవసన ములఁ దొలఁగింపఁజేసి పరిశుభ్రమైన భోజనముఁ బెట్టింపసాగెను. వారము రోజులలో రాజు సహజస్వరూపమునొంది, తనరీవిని చూపగా వారు “అహా! ప్రత్యక్షముగా రజ కళింగగంగే వచ్చి యభినయిం చెనా యని తోఁచుచున్నది; మహారాజుగారు నిజముగాఁ బ్రశంసించి యీసారి విశేషముగా మనలను బహూకరించును” అని తలపోసెను. పురములోని వారందఱును, రాజేంద్రుఁడగు విక్రమదేవుఁడును గూడ రాజ కళింగగంగు వేషమును జూచుట కువ్విళ్ళూరుచుండిరి!

ఆవేషము మఱింతచక్కగానుండుటకై నాయకుఁడు విక్రమ దేవు ననుజ్ఞఁబడసి కోటలోనున్న రాజకళింగగంగు శిరోవేష్టము, కరవా లము, అశ్వములను గొంపోయెను. క్షురకుఁడు ప్రదర్శనము నాటి యుదయమునవచ్చి రాజ కళింగగంగు గడ్డముఁదీసి, తన ప్రభువును గుర్తించి “మహారాజా! ఎన్నాళ్ళకుఁ దమదర్శన భాగ్యమునొంది తిని!” అని సాశ్చర్యముగా ననెను. రాజ కళింగగంగు “ఓరీ! బిగ్గ ఱగా నేమియుననకుము. ఏమి విచిత్రము జరుగునో చూచుచుండు” మనెను.

రాత్రి ప్రదర్శనమేర్పాటు చేయబడియెను. రాజకళింగగంగు దివ్యాంబరాభరణ భూషితుఁడై శివిమెఱయు నిటునటు తిరుగుసరికి విక్రమదేవుఁడునతనితోఁగలవారలును మహదానందభరితాంతరంగులై 'సెబాస్! చాలబాగున్న' దని మెచ్చుకొనసాగిరి. రాజకళింగగం గిటునటు లొయ్యారముగ హయమునెక్కి తిరుగుచు కరవాలము ఝుళిపించుచు నాఖడ్గముతో విక్రమదేవుని కంఠముఁదెగనరికెను. సభ లోనివారందఱు నిశ్చేష్టులై చూడసాగిరి. పరిచారకులు కళవళపడిరి.

రాజకళింగగంగు 'మీరెవ్వరు నేమియు సంశయింపనక్కఱ లేదు. నేనే రాజ కళింగగంగును. శత్రురాజుల యధీనమునుండి రాజ్య మును పొందిన నేనే మీరాజును' అని పలికి, విక్రమదేవుని యంత్య క్రియలు జరిపెను. ఈవృత్తాంతమునాలకించి, వంగదేశమునుండి విక్రమదేవుని కుమారుఁడు ప్రచండసైన్యసమేతుఁడై వచ్చి రాజ కళింగగంగు నెదుర్కొని యుద్ధముచేసెనుగాని, భీమకవియాశీర్వచనాను సారముగ విజయము కళింగగంగునకే లభించెను. విజయానంతర మైన నాతఁడు వేములవాడ భీమకవిని మఱువక విశేషముగ బహూ కరించి, యెల్లప్పుడు విధేయుఁడై యుండసాగెను.

---

## 7. చోక్క భూపతి

రాజనరేంద్రుఁడు రాజమహేంద్రవరము నేలుచున్నపుడే హేలా పురమను పేరుగల యేలూరునకు సమీపముననున్న పెదవేఁగి యను పట్టణమును రాజధానిగాఁ జేసికొని చళుక్యవంశజుఁడగు చోక్క భూపాలుఁడు పరిపాలన మొనరించుచుండెను. భీమకవి యొకనాఁడు పెద వేఁగిఁ బోయెను. చోక్కభూపాలుడు భీమకవి తనపురికి వచ్చి

నాఁడని యెఱింగి, సగౌరవముగఁ దన యాస్థానమునకు రమ్మని యాహ్వా నించెను.

భీమకవి యారాజేంద్రుని కొలువుకూటమునకుఁ బోయెను. చొక్కభూపతి యాతనిఁగాంచి 'కవివతంసమా! నీవేమన్న నది జరుగునని వింటిని. నా యెడ సౌహార్దమూని యాపందిరిస్తంభము చిగురించునట్లు చేయుము' యనెను భీమకవి వెంటనే యీపద్యముఁ జదివెను—

శా. ఆసీతాభ్యుపదాన శృంఖలపదాభ్యాలంబిత స్తంభమా
నేనే వేములవాడభీమకవి నేనిన్ చిత్రకూటంబులో
భూనవ్యాపితపల్లలోద్భవ మహాపుష్పప్రగుచ్ఛంబులన్
నానాపక్వఫల ప్రదాయినగుమా నాకల్పవృక్షాకృతిన్.

ఆ స్తంభ మాయుత్తరక్షణముననే పూలతోడను, నాకులతోడను చిగిర్చి, చొక్కభూపతికి నేత్రపర్వముఁ గావించెను. 'ఆస్తంభము మఱల నెప్పటిరీతినే యుండునట్లు చేయు' మని చొక్కభూపతి వచింప, భీమకవి యిట్లు చదివెను—

ఉ. శంభువరప్రసాద కవిసంఘవరేణ్యుఁడనైన నావచో
గుంభనమాలకించి యనుకూలతనొంది తనూనభావనన్
గుంభిని జొక్కనామ నృపకుంజరు పందిటిమల్లెనాలకున్
స్తంభమురీతి నితనువుదాలిచి యెప్పటియట్లయుండుమా.

ఇట్లు చదివినంతనే యాపందిరిస్తంభ మెప్పటివలె నయ్యెను. చొక్కభూవరేణ్యునకు భీమకవిపై నపరిమితగౌరవభావ ముదయించెను. ఆకవివతంసు నాతఁడు కొంతకాలమైనఁ దనయాస్థానమున నుండఁగోరెను.

భీమకవి చొక్కనృపాలుని యాస్థానమున నుండెను. సాహిణి మారుఁడను శత్రురాజు పెదవేఁగిపై బ్రహ్మాండమగు సైన్యమును

దోడ్కొనివచ్చెను. రాజమహేంద్రవరము నేలుచుండిన రాజనరేంద్రుఁడు చేపక్షమువారికిని సాహాయ్యముఁ జేయక తటస్థముగా నూరకుండెను. ఉద్దండపురముకడ భయంకరసంగ్రామము జరిగెను. చోక్కభూపాలుఁడు ధైర్యసాహసములతో పోరాడినను, సాహిణిమారుని సైన్యమసంఖ్యాకమై యుండుటచే జయించుట దుస్సాధ్యముగానుండెను. చోక్కభూపతి భీమకవి నుద్దేశించి 'మహాత్మా! ఈరణము ముగియు నట్లుతోఁచదు. నాకు జయము కలుగునట్లనుగ్రహించవే' యని వేఁడుకొనెను. భీమకవి వెంటనే యీపద్యముఁ జదివెను.

ఉ. చక్కదనంబు దీప్తియగు సాహిణిమారుఁడు మారుకైవడిన్
బొక్కపడంగలండు చలముంబలముం గలయాచళుక్యవున్
చోక్కనృపాలుఁ డుగ్రుఁడయి చూపక్కలమంటలురాలఁ జూచినన్
మిక్కిలి రాజశేఖరుని మీఁదికివచ్చిన రిత్తవోవునే.

ఈ పద్యపఠనముఁ బూర్తియగుసరికి సాహిణిమారుఁడు నిలువునను మాడిపోయెను. ఆతఁడు మృతినొందగనే సైన్యము చెల్లాచెదరై పలాయన మొనరించెను. విజయము చోక్కభూపతికే లభించెను. భీమకవి నీతఁడు విశేషముగ బహూకరించి, తన జీవితకాలములో నెల్లపుడు నాతనికి విధేయుఁడై యుండెను.

## 8 మాచనమంత్రి

ఈ మాచనమంత్రి ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. సింగనయాతనితండ్రి. తల్లి లక్కమాంబ. ఈమాచనమంత్రి రాజేంద్రచోడుని యమాత్యుఁడును, దండనాథుఁడునై యుండెను. వేములవాడ భీమకవి యొకనాఁడు మాచనమంత్రి యింటికేగెను. ఆ సమయ

మున రాజకార్యాలోచనా మగ్నుఁడై యుంటచే భీమకవిని పలుకరింపఁ డాయెను. పదగర్వితుఁడై తనతో సంభాషింపలేదని యూహించి, మాచనమంత్రిని కొంచెము మందలించినట్లు అర్థమిచ్చు నీపద్యములఁ జదివెను—

సీ. న్యాయంబుదప్పని నరపతి నరపతి
నరపతిపాలించు నాడు నాడు
నాఁడెఱింగినదొర ప్రోఁడిమి ప్రోఁడిమి
ప్రోఁడిమి సాబగైన బుధులుబుధులు
బుధులు సంభావించు పురుషుండు పురుషుండు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి
గీ. పొలఁతి యట్టిదకలవాని కలిమి కలిమి
కలిమి చలమని తెలిసిన తెలివి తెలివి
భానునిభ తేజ ! లక్కమాంబాతనూజ
మనుజమందార సింగన మంత్రిమాచ.

సీ. కులమును రూపును గుణమునుగల్గిన
యింతి నిల్లాలుగా నేలవలయు
వీర్యంబు హితమును వెరవునుగల్గిన
పురుషుని బంటుగాఁ బ్రోవవలయు
స్త్రీపెంపువాటింప మోపరి కలిమిమై
నిలయేలు రాజును గొలువవలయు
అఖిలంబు నెఱిఁగి దయాళుఁడై పెంపొందు
మూర్తి సద్గురుఁడంచు మ్రొక్కవలయు
గీ. కాన నిన్నిగుణంబులు కలిగెనేని
కానియెడఁ బుత్రునందు భూపాలువలన

గురునిపట్టిన సౌఖ్యంబు గూరుటరుదె?
మనుజమందార సింగనమంత్రి మాచ॥

సీ. అర్థులయెడలఁ బ్రత్యర్థుల యెడలను
వెఱపెఱుంగనివాఁడె వీరవరుఁడు
సతులసన్నిధి మహీపతుల సన్నిధియందుఁ
దత్తరింపనివాఁడె ధైర్యవరుఁడు
ధన మగ్గలంబైన జపమగ్గలంబైన
గర్వము దనివాఁడె కార్యవరుఁడు
శివునిమీఁదనైనఁ గేశవునిమీఁదనైనను
దలఁపునిల్పినవాఁడె తత్త్వవిదుఁడు

గీ. కాన నిట్టివివేకంబు గలిగిమెలఁగు
పురుషు లిహపరసౌఖ్యముల్ పొందువారు
భానునిభతేజ లక్కమాంబాతనూజ
మనుజమందార సింగన మంత్రిమాచ.

సీ. ఉద్యోగహీనుఁడై యుండెడి మనుజుని
బ్రోవంగఁజాలడే దేవుఁడైన
ధరఁ గృతఘ్నుండైన నరునివర్తనచూచి
త్రొక్కదేవచ్చిన కుక్కయైన
అత్యంత ధనలోభియగువాని యెడఁబోసి
నవసివర్తిలవె ప్రాణంబులైన
అఖిల జగద్ద్రోహియగువాని కలుగదే
కృపచాలఁ గల్గిన తపసులైన

గీ. గానసుద్యోగియై కృతఘ్నతకుఁబాసి
వెలయులోభంబు విడిచి జీవులకునెగ్గు
సేయకుండెడువాఁడు వశిష్ఠుఁడంద్రు
మనుజమందార సింగన మంత్రిమాచ.

సీ. వంపద్ఘ్నుని జేయఁజనదు కృతఘ్నుని
 సైన్యాధిపతిఁజేయఁ జనదుభీతి
కపటాత్ము నాత్మీయుఁగాఁ జేయవలదు
 సన్మంత్రిమెఱిఁగింపఁ జనదుసభల
కార్యంబు లూహింపఁగాఁ దవివేకితో
 గాదు వంచకుఁ గార్యకర్తఁజేయ
పాపాత్ముఁ బరమిత్రు భర్తృహీనుని
 వలవదు పరిచర్యవర్తిఁజేయ
గీ. అనృతభాషుచేత దుర్జనముచేత
లోలమతిచేత నత్యంతలోభిచేత
వినినకార్యంబు వలదు విశ్వసింప
మనుజమందార సింగన మంత్రిమాచ.

సీ. ఈలోకపుసుఖంబు నాలోకపుసుఖంబు
 సతిచేత సుతుచేతఁ జాలఁబడసి
మేనురోగంబును లోని రోగంబును
 వెజ్జుచే వేల్పుచే నుజ్జగించి
సురతర్పణంబు భూసురతర్పణంబును
 భక్తిచే శక్తిచేఁ బరగఁజేసి
అతిసుకృతంబును నభిమతార్థంబును
 నీతిధైర్యంబుల నెఱయఁజేసి
గీ. తొల్లి చన్నమహాత్ముల త్రోవదెలిసి
తప్పకుండ మెలఁగువారు తత్త్వధనులు
భానునిభతేజ లక్కమాంబాతనూజ
మనుజమందార సింగన మంత్రిమాచ.

సీ. కులమున నధికుఁడై గుణవంతుఁడయ్యెనా
యాకారహీనుఁడై యలరుచుండు
నాకార లక్షణంబంతయుఁ గల్గినా
యోగ్యతలన్నియు నొప్పుచుండు
యోగ్యతలన్నియు నొప్పుచునుండెనా
గర్వాంధకారంబు గప్పియుండు
గర్వాంధకారంబుఁ గప్పకయుండెనా
యనుకూల సతిలేక యొనయుచుండు
గీ. కొమ్మగలిగిన సంతతి కొఱకువగచు
పుత్రసంతతి మొదలుగఁబొందె నిన్ను
భానునిభతేజ లక్కమాంబాతనూజ
మనుజమందార సింగన మంత్రిమాచ

ఈపద్యముల నాకర్ణించి మాచనమంత్రి నిరతిశయానంద భరితాత్ముఁడై భీమకవి నుచితరీతిని సత్కరించెను. ఆయమాత్యవరేణ్యుఁ డిచ్చిన ధనముతో భీమకవి బీదల కన్నవస్త్రదానముఁ జేసెను.

## 9. రణతిక్కన.

రణతిక్కన యనియు, ఖడ్గతిక్కన యనియు బేర్గాంచిన యీమహాశూరుని తండ్రి సిద్ధయామాత్యుఁడు; తల్లి మైలమాంబ. పెంచుకొన్నతల్లి పోలమాంబ. కన్నతల్లి మైలమాంబకు భీమన యను నందనుఁడుకూడ కలఁడు. ఆతఁడును రణతిక్కనయుఁగూడ నెల్లూరు నకుఁ బ్రభువైన మనుమసిద్ధిరాజునొద్ద దండనాధులుగనుండిరి భారత రచయితయగు తిక్కనసోమయాజి యీతని పినతండ్రికుమారుఁడు. వీరి రువురును మనుమసిద్ధిరాజు కాలమున కవితిక్కన, ఖడ్గతిక్కన యని జగ ద్వినుతిఁగాంచిరి. ఆర్వేలనియోగిబ్రాహ్మణులు వీరు.

ఒకప్పుడు మనుమసిద్ధిభూపాలునకు ఎఱ్ఱగడ్డపాడు నేలుచుండిన కాటమరాజునకును పోరాటముం దటస్థించెను. మనుమసిద్ధిరాజునకుం గాటమరాజు కొంతపుల్లరి నిచ్చుచు తనపశువులను రాజుకుం జెందియున్న బీడులో మేపుకొనుచుండెను. ఈపుల్లరి నిచ్చువిషయములో నేదియో తగవు రాగా మనుమసిద్ధిరాజునకును కాటమరాజునకును పంచలింగాలపాడు అనుచోట బ్రహ్మాండమగు సంగరముజరిగెను. మనుమసిద్ధిరాజు సైన్యమునకు దండనాథుండుగానున్న రణతిక్కన యుద్ధముం జేయు నరిగి, తనసైన్యములు కాటమరాజు సైనికులచేఁ జిందరవందర గావింపఁబడగా మఱలఁ గ్రొత్తసైన్యములఁ గూర్చుకొని రణభూమి కేగుట యుక్తమనియెంచి తిరిగి యింటికివచ్చెను.

రణతిక్కనకు మేనత్తకుమారుఁడగు వేములవాడ భీమకవి యాసమయమునకే నెల్లూరునకుఁ బోయియుండెను. రణతిక్కన రణరంగమునుండి విజయముపొందకుండ తిరిగివచ్చెనని యింటిలోనివా రందఱును గ్రహించిరి. "స్నానమునకు జలము సిద్ధముచేయు" మని పలుక నాతనిభార్య చానమ్మ యచ్చటనులకమంచము, పసుపు కుంకుమ మునుంచెను. అదియాతఁడు చూచి "ఇదియేమి? ఆడువారు స్నానముచేయునపు డుండవలసిన వన్నియు నుంచితివి?" వని ప్రశ్నింప, నామె "మనయింటిలో మీతల్లియు, నేనును మాత్రమే యింతవరకు స్త్రీలమైయుంటిమి. కదనస్థలినుండి అపజయమునొంది యింటికిఁ దిరిగి వచ్చినమీరుకూడ నాడువారిలోనే లెఖ్ఖకదా! అందుచే ముగ్గురము నాఁడువారమైతిమి" అనెను. భీమకవి ఖడ్గతిక్కనంజూచి, యీక్రింది పద్యమును జదివెను.

క. పగఱకు వెన్నిచ్చినచో
నగరేనిను మగతనంపు నాయకులెందున్

ముగురాదు వారలై తిరి
వగవేటికి జలకమాడ వచ్చినచోటన్.

ఖడ్గతిక్కన భోజనముకడ కూర్చుండ తల్లి విఱిగినపాలను బోసెను. 'అమ్మా! పాలువిరిగినవే?' యని రణతిక్కన ప్రశ్నింపఁగా, నామె—

క. అసదృశముగనరి వీరుల
మసిపుచ్చక విఱిగివచ్చు మగపందక్రియన్
గసవున్ మేయఁగఁబోయిన
పసులున్ విఱిగినవి తిక్క! పాలున్ విఱిగెన్.

తల్లికూడ యట్లనినంతనే వీరావేశవివశుఁడై రణతిక్కన భోజనము నసంపూర్తిగానే విడిచి, చేయికడిగికొని అశ్వారూఢుఁడై సంగ్రామరంగమునకరిగిఁ బ్రచండమార్తాండునిభంగి మెలంగి యనేక శత్రుసైనికుల దునిమి తాను వీరస్వర్గ మలంకరించెను.

భీమకవి రణతిక్కన శౌర్యసాహసపరాక్రమముల నిట్లు వర్ణించి యున్నాఁడు—

చ. పదటునవాజి రాహుత్తులపై దుమికింపుచుఁ దిక్కఁడార్చినన్
బెదరి పరిభ్రమించికదుఁ బిమ్మటవీరులు భీతచిత్తులై
యదెయిదె! వాలువాల్మెఱుఁగులల్లదె! యల్లదె యాలఁడంచనన్
గొదుగక యాజిసేసె రిపుకోటులకందఱకన్నిరూపులై.

ఉ. చిక్కక మన్మసిద్ధి విభుచేమునుగొన్న ఋణంబుఁదీర్చుమా
తిక్కనమంత్రి సోమశిలదేవరసాక్షిగఁ బెన్నసాక్షిగా
నెక్కినవాజిసాక్షిగ మహిన్నుతికెక్కిన కీర్తిసాక్షిగా
నుక్కకమారుకొన్న రణశూరులు సాక్షిగఁ గొండసాక్షిగన్.

సీ. ధైర్యంబు నేమేనఁదగిలి యుండుటఁజేసి
చలియించి, మంధరాచలము తిరిగె

గాంభీర్యమెల్లనీ కడనయుండుటచేసి
కాకుత్థ్సుచే వార్ధికట్టువడియె
జయలక్ష్మి నీయురస్థలిని యుండుటజేసి
హరిపోయి బలిదాన మడుగుకొనియె
ఆకారమెల్లనీ యందయుండుటఁజేసి
మరుఁడు చిచ్చునఁబడి మడిసిచనియెఁ
గీ. దిక్క దండనాథ ! దేవేంద్రపురికిపో
వరుగుటెఱిఁగి నగము తిరుగుటుడుగు
నబ్ధికట్టువిడుచు నచ్యుతుకొఁదమాను
మరుఁడు మఱలఁగలుగు మగలరాజ !

సీ. నందినిఁ బుత్తెంచె నిందుశేఖరుఁడునీ
వన్న ! యేతెము తారాద్రికడకు
గరుడుని బుత్తెంచె నరహరి రావయ్య
నగసిద్ధతిక్క ! కైవల్యమునకు
హంసను బుత్తెంచె నజుఁడు నీకడకును
భయకులమిత్ర ! రా బ్రహ్మసభకు
ఐరావతమునంపె నమరేంద్రుఁ డిప్పుడు
దివమునకేతెమ్ము తిక్కయోధ!
గీ. యనుచు వేఱువేఱ యర్థితోఁ బిలువంగ
వారు వీరుఁగూడి వచ్చివచ్చి
దివ్యయోగియైన తిక్కనామాత్యుఁడు
సూర్యమండలంబు సొచ్చిచనియె.

ఉ. వెన్నెలలేని రాత్రియు రవిప్రభలేనిదివంబు నీరులే
కున్న సరోవరంబుఁ గ నొప్పగు దీపములేని యిల్లునై

విన్నదనంబునొందె మనవిక్రమసింహపురంబు చూడఁగాఁ
బున్నమచందురుఁ బోలుమన పోలమతిక్కఁడు లేమినక్కటా

ఉ. ఏమితపంబుఁజేసి పరమేశ్వరు నేమిటఁ బూజచేసిరో
రామునితల్లియున్ బరశురాముని తల్లియు భీముతల్లియుం
గాముని కన్నతల్లియును గంజదళాక్షు ననుంగుదల్లియున్
శ్రీమహిత ప్రతాపుఁడగు సిద్ధయతిక్కనఁ గన్నతల్లియున్.

ఉ శ్రీలలరార శత్రువులఁ జెండితివార్యులు మంత్రివర్యులా
ర్వేలఘుకల్ మతిన్ నిరలనేర్పుదొరల్ ముకమాదిమెచ్చిరో
లాలిత శౌర్యధైర్యజయలక్ష్మి క్రియంజన నివ్వరించె నీ
లీలలు హెచ్చెఁ దిక్కనికి లేబరమా యికనిల్చి యూడుమా.

నెల్లూరున కనతిదూరమునఁ దిక్కపాడు అను స్థలమున నిప్పటికిని రణతిక్కన శిలాప్రతిమను జూడగలము. భీమకవి రచించిన పద్యముల వలననే తిక్కన ధైర్యసాహసపరాక్రమములు పరిస్ఫుటమగుచున్నవి. మహాపురుషులు జీవితముల నిరంతరానరింద సంధాయకములు, స్మరణీయములుగదా!

---

## 10. ఒక చాటువు.

భీమకవి సంతర్పణకుఁ దన్ను మొదట రానీయక పిదప బ్రతిమాలి గొంపోయినపుడు చదివిన చాటువునందలి యర్థమిది. పద్యములో 'గడియలోపల డాడికడఁగి ముత్తురియుగాఁ దిట్టినమేధావి భట్టుకంటె' అని యున్నందువలన సాళువ పెద్దతిమ్మనృపాలుఁ డను పదునైదవ శతాబ్దమునందలి రాజేంద్రునిగురించి యీపద్యమును మేధావిభట్టు వ్రాసెనని గ్రహింపవచ్చును.

క. సాళువ పెదతిమ్మ మహీ
పాలవరుఁడు వీఁడెవచ్చెఁ బద్యమువ్రాయన్
గేలనులేదా కొక్కటియుఁ
దాళమమ్రుత్తులియ లగుచు ధరణింబడుమా.

'రెండుగడెల బ్రహ్మదండి ముండ్లన్నియుఁ దుల్లఁదిట్టెనకవి మల్లుకంటె'

గుడియన్న నృపతి పదవశతాబ్దములోఁ గొండపల్లిని పాలించెనని యొక శిలాశాసనమువలనఁ దెలియుచున్నది.

క. గుడియన్న నృపతిఁబొడఁగన
నడువంగా, గొండపల్లినగరి పడమటన్
గుడియెడ మడమఁగాడిద
జెడుముండులు బ్రహ్మదండిచెట్లున దుల్లన్.

బడబాగ్నిభట్టు చెఱువునందలి నీరింకిపోవు పద్యముఁ జెప్పెను. జలమున నర్ఘ్యము విడుచుచు నుంగరము చెఱువులోఁ బడిపోయినపుడు వెదకివెదకి వేసారి బడబాగ్నిభట్టు యీపద్యముఁ జెప్పెను —

క. బడబానల భట్టారకు
కుడిచేయుంగరము రవికి గొబ్బునయర్ఘ్యం
బిడివేళ జాఱినీలో
బడియె తటాకమ నీరెబాయుము వేగన్.

---

# 11. భీమకవి కాలము.

భీమకవి జీవించియున్న కాలమునుగూర్చి పలువురు పలురీతుల వ్రాయుచున్నారు. అప్పకవీయము రచించిన సూర్యప్పకవి తనగ్రంథమున నిట్లుదహరించినాఁడు.

గీ. ఆంధ్రశబ్ద చింతామణివ్యాకరణము
ముందురచియుంచి తత్సూత్రములఁ దెనుంగు
బాసచేఁజెప్పె నన్నయభట్టుతొల్లి
పర్వములుమూఁడు శ్రీమహాభారతమున.

గీ. భారతముఁ దెనిగించుచుఁ దారచించి
నట్టి రాఘవపాండవీయము నడంచె
ఛందమునడంపనీ ఫక్కిసంగ్రహించె
ననుచు భీమున యొంతయునడఁచెదాని

అదిగాక మఱియును—

ఉ. ఆదిని శబ్దశాసన మహాకవిసెప్పిన భారతంబులో
నేదివచింపఁగా బడియెనొదును దానినొకాని సూత్రనం
పాదనలేమిచేఁ దెలుఁగుపల్కు మతెక్కడఁ గూర్చిచెప్పఁగా
రాదని ద్రాక్షపాటికవిరాక్షసుఁడీ నియమంబుఁ జేసెనన్.

క. ఆమూఁడు పర్వములలో
నామాన్యుఁడు నుడువు తెనుఁగు లరసికొనికృతుల్
దాము రచించిరి తిక్కను
భీమణి మొదలైన తొంటితెనుఁగుకవీంద్రుల్.

గీ. రాజరాజనరేంద్ర తనూజుఁ డార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయరచించునెడ, బరసంబొనర్చె
నన్య లెవ్వరెరుంగరీ యాంధ్రఫక్కి

క. ఆదిని భీమకవీంద్రుఁడు
గోదావరిలోనఁ గలిపెఁ గుచ్ఛితమున నా
మీఁదఁట రాజనరేంద్ర
ఖ్యాదయితుని పట్టిదాని మహి వెలయించెన్

ఈపద్యములవల్లన వేములవాడ భీమకవి రాజనరేంద్రుఁడు, నన్నయభట్టుల కాలముననే యుండెనని నిర్ధారణ యగుచున్నది— శ్రీనాథుఁడు వ్రాసిన పద్యమునుగూడ గమనింపఁదగును—

సీ. వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతునన్నయభట్టుమార్గంబున
నుభయభాషాప్రౌఢి నొక్కమాటు
వాక్రుత్తుఁ దిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని త్రోవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు
గీ. నైషధాది మహాప్రబంధములు పెక్కు
జెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడవనఘ
యిపుడు చెప్పఁదొడంగిన యీప్రబంధ
మంకితముసేయు వీరభద్రయ్యపేర.

ఇందువలన శ్రీనాథునకు భీమకవి పూర్వుఁడేనని బోధపడుచున్నది. భీమకవి సంస్కృతమున రచించిన యొక జ్యోతిషగ్రంథమును దెనిఁగించుచు నందీక్రింది సీసమాలిక నుదహరించెను. దీనివలన భీమకవి జననకాలము గ్రహించుట కవకాశ మొదవుచున్నది.

సీ. శ్రీకరంబై ధర జెలువుఁగాంచినయట్టి
భీమపురంబునఁ బ్రేమమీఱ
భీమేశ్వరుండును బ్రియముతో భక్తుల
కోర్కెలొసంగుచుఁ గొమరుమిగుల
నొకనాఁడు తత్పురి యువతులుగొందఱు
భక్తి భీమేశ్వరు భవనమునకు

బోయి పుత్రులచేత ముగ్ధత్వమునఁజొక్క
విధవకుమారుని వేడ్కఁగోర
నాలేమ ముగ్ధతకపహసించుచు నల
భీమేశ్వరుఁడు పుత్రుఁబ్రీతినొసఁగ
నాకాంత గర్భిణియై కాంచెఁ దనయునిఁ
కలియుగాదినిఁ బ్రేమ కడలుకొనఁగ
ప్రభవ వర్షంబున శ్రావణమాసంపు
శుక్లపక్షంబున శోభనంబు

మీఱఁ బంచమి శుక్రవారంబునను హస్త
యందుఁ గన్యాలగ్నమందు వెలయ
విలివెట్టి రక్కాంత విధవయైపుత్రునిఁ
గాంచెనటంచును గడమజనము
నంత దత్తనయుండు నైదేండ్ల బాలుఁడై
పురి బాలకులతోడ బొనఁగనాఁడ
జనులెల్ల గోళకుఁడని నిందచేసిన
రోషించి యాతండు దూషితయని

జ్రాయెత్తి తనతల్లి నేయఁబోయినయది
భీమేశ్వరుఁడు దయపెద్దఁగలిగి
ప్రత్యక్షమై వత్సరమ్మని తగఁజేరి
పశుపక్షి మృగములఁ బ్రాణికోట్ల
గలిగించు శక్తియుఁ గరమొప్పజనులకు
బిడ్డనాయువుఁ బెంపుఁదనర
సంపదలొసఁగెడు సామర్థ్యమును నిడి
కానిది యానన్నియైనదెల్ల

గాదనినట్టులఁ గావించుబలమును
మునురాఁగలుగు నదియును దెలుపఁగ
దాక్షిణ్యమునునిచ్చి ప్రబలుము నీవని
వరమిచ్చెఁ బదియాఱు వర్షములకు

..............................

సతఁడొక్కచెప్పిన సట్లుచేయుచునుండె
సరిలేనికీర్తిచే జగతివెలసి
గీ. యతఁడు చెప్పిన శాస్త్రమందధికభక్తి
గలిగి నిజమనితలఁచిన గలుగుశుభము
కోర్కెలెల్లను ఫలియించు గురుతరముగ
సకలజనులకుఁ దప్పదు జగతిలోన

భీమకవి జన్మస్థలమగు వేములవాడ యిప్పటికి వేఁగులవాడయనుపేరుతో నొప్పుచున్నది. వేములవాడకు సమీపముననున్న దక్షవాటికనాఁబడు దాక్షారామమును గూర్చియు, భీమేశ్వరాలయమును గుఱించియు భీమఖండ కాశీఖండములం దిట్లువర్ణితమైయున్నది.

భీమఖండములో:—

సీ. జహ్నుకన్యాతీర సన్నివేశమునకు
దక్షిణాంభోరాశి తటముసాటి
కమనీయమణికర్ణికాలప్రవాహమునకు
సప్తగోదావరి జలముసాటి
కవికరక్షకుఁడైన కాలభైరవునకు
బ్రికట పాతాళభైరవుఁడుసాటి
విశ్వాధిపతియైన విశ్వేగాయకునకు
భీమనాథేశ్వర స్వామిసాటి

గీ. మోక్షవిధమంబునకు సాటి మోక్షలక్ష్మి
భోగమహిమంబునకు సాటి భోగమహిమ
వారణాశికి శ్రీదక్షవాటమునకుఁ
దారతమ్యంబు చర్చింప ధర్మమగునె?

కాశీఖండములో:—

సీ. పట్టిన శ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమ నాథునంఘ్రులకు నెరగి
పురశాసనుననంత భోగేశ్వరస్వామి
హిమశైలకన్యకాధీశుఁగొల్చి
పద్మాద్రిపై రుద్రపాదంబులర్చించి
చేరిమార్కండేయ శివుభజించి
కోటిపల్లితీర్థ కుండలాముఖముల
నర్ధేందుదరు విరూపాక్షుఁ దలఁచి

గీ. పల్వనస్థానమున భూతభర్త నిలిపి
కణకగాంతేయమున వృద్ధగంగఁగ్రుంకి
దక్షవాటిక సప్తగోదావరమున
మునిఁగి భీమేశ్వరునిగాంచె మునివరుండు.

భీమఖండమున:—

సీ. గజచర్మ మెన్నఁడోకాని నిచ్చలుగట్టు
పసిడికమ్మలపట్టు పచ్చడంబు
భసితమెన్నఁడోకాని ప్రతిబింబమునయందు
మలయజంబు కురంగమదముఁగూర్చి
నిడుదపాములరాజు తొడవులెన్నఁడోకాని
తారహారములు నిత్యముధరించు
నృకరంగరుండమాలిక లెన్నఁడోకాని
ధరియించు కల్హారదామమెపుడు

గీ. కాటనడుచక్రినెన్నడో కానియుండు
దక్షవాటి సువర్ణసౌధములమీద
నెన్నడో పిశాచులకుగాని యిందుముఖుల
నెల్లకాలములందు భీమేశ్వరుండు.

సీ. పర్యంతమందార పారిజాతకనీన
రమణీయ నిర్ఝరీసముదయంబు
నరసరసాసిద్ధ వరవారిసంపూర్ణ
గంభీరతరపరిఖాపయోధి
ప్రబల చింతారత్న పాషాణసంఘాత
వప్రరేఖాచక్ర వలయితంబు
గామధనుసహస్ర కఠినరిఖాంటంక
దళనదంతురిత రథ్యాముఖంబు

గీ. భద్ర పాతాళభైరవ పాలితంబు
గుహవినాయక రక్షణాంకురితంబు
సప్తమాతృకపరివార సంకులంబు
వసుమతీ నూపురము దక్షవాటిపురము.

మ. అదె సంవేద్యము, కోటిపల్లియదె దక్షారామమున్ పట్టణం
బదె, యభ్రంకనుసౌధకూట ఘనహేలంకానిమునచ్ఛాయనం
పద సొంపారెడు భీమలింగము మహాప్రాసాద భూమీధరం
బిదె; సప్తర్షినదీప్రవాహమిదె సంవీక్షింపు మేకాగ్రతన్.

సీ. అగ్రజుండైనను నంత్యజుండైనను
బూబోడియైనను బురుషుఁడైన
బరమమూర్ఖుండైనఁ బండితుండైనను
దారిద్ర్యకుండైన ధనికుఁడైన

బలవంతుఁడైనను బలహీనుఁడైనను
ప్రాయంపు వాఁడైన బంగుడైన
నాస్తికుండైనను నన్నృతవాదియునైన
బరగ గార్దభమైనఁ బందియైనఁ
గీ. గీటకంబైన బకమైనఁ గ్రిమియునైన
పాదపంబైన దృణమైన బ్రాణరహిత
మైరహిని దక్షవనచతుర్ద్వారసీమ
బొందుఁగైవల్య కళ్యాణభోగలక్ష్మి.

సీ. దక్షప్రజాధినాథ మహాధ్వరక్రియా
దీక్షాధిగమపుణ్య దేశమునకు
బ్రహ్మవిష్ణు పురందర ప్రధానసుపర్వ
పరమసంయమి సభాభవనమునకు
దాక్షాయణీయోగ దహనార్చిరున్మేష
సామిధేనీమంత్ర జాతమునకు
వీరభద్రభుజావిహార హేలాసమా
రంభనాటక నాట్యరంగమునకు
గీ. నమృతమ్మయదివ్యతేజ స్స్వయంభులింగ
శాంతభీమేశ్వరేశ్వర స్థానమునకు
దక్షవాటంబునకు మోక్షధామమునకు
భోగజన్మస్థలమున కీపురము సరియె?

సీ. కాంతిసంపద నేలకై వారమొనరింప
విభుబింబమున నుద్భవించిరనఁగ
మాధుర్యగుణమేల మాటిమాటికిఁ జెప్ప
నమృతాబ్ధి నవతారమందిరనిన

నేదోవిశేషంబు తెలుఁగుపల్కఁగనేల
విద్యుల్లతలలోన. వెడలిరనిన
మోహనాకృతియేల మునుపూడికొనియాడ
బుష్పచాపుని వింటఁ బుట్టిరనిన
గీ. సంభవించిరి గంధర్వజాతిననిన
గలితనంబేల పెన్నాటకంబుసేయ
ననగ భీమేశ్వరునిగొల్తు రప్పురమున
సానులనుపేరి యప్సరచ్ఛందప్రముఖులు.
సీ. ఒకవేళ ధరియించు యవనాశ్వుఁడచ్చిన
కట్టాణిముత్యాల కంఠమాల
మాంధాతృఁ డిచ్చిన మాణిక్యఖచితకే
యూరంబు ధరియించు నొక్కవేళ
నిక్ష్వాకుఁడిచ్చిన హేరాంకరంబుల
యుంగరంబులధరించు నొక్కవేళ
ఘనచక్రవర్తి యిచ్చిన ప్రవాళంబుల
యొడ్డాణము ధరించునొక్కవేళ
గీ. వేడ్కధరియించు నొక్కొక్కవేళయందు
భరతదుష్యంత నాభాగనహుష
నలభగీరథ నృగఘునాథదత్త
హేమ మణిభూషణములు భీమేశ్వరుండు.
సీ. దక్షవాటీ మహాస్థానంబులోలేని
యమరు లేస్థానంబునందులేని
దక్షవాటీ మహా స్థానంబులోలేరు
యర్థ మేస్థానంబునందులేదు
దక్షవాటీ మహాస్థానంబులోలేని
యమృత మేస్థానంబునందులేదు

దక్షవాటీ మహా స్థానంబులోలేని
యజ్ఞ మేస్థానంబునందు లేదు
గీ. దక్షవాటిక సకలతీర్థముల కిరవు
దక్షవాటిక సకలవిద్యలకు గరిడి
దక్షవాటిక విభవంబు తానకంబు
దక్షవాటిక శివుని యంతఃపురంబు

మల్లన విరచించిన రుక్మాంగదచరిత్రమున నిట్లున్నది—

సీ. కామ్యార్థ ఫలసముత్కరకల్ప తరువాటి
దళితపాతకకోటి దక్షవాటి
ప్రణుతకళ్యాణైక గుణమణివ్రజపేటి
ధాత్రికటీశాటి దక్షవాటి
సన్మునీంద్రారామ సస్యమేఘస్ఫోటి
దమితరోగనిశాటి దక్షవాటి
రథవిమానాతపత్రపతాక గజఘోటి
తాపాద్రిశతకోటి దక్షవాటి
గీ. దర్పితాశాలతాకోటి దక్షవాటి
దమరు నిగమావిపురిచేటి దక్షవాటి
ద్వారసేవిత కర్ణాటిదక్షవాటి
రక్షితేందుకిరీటి శ్రీదక్షవాటి.

ఈ పద్యములవలన భీమేశ్వరాలయము వలనఁ బ్రసిద్ధమైన ద్రాక్షారామమును వేములవాడయు సమీపస్థ గ్రామములే యని బోధపడుచున్నది.

---

# 12. సప్తసప్తాహము.

దాక్షారామమున సప్తగోదావరీతీరమున భీమకవి విశాలము లైన పందిళ్లువేయించి సప్త సప్తాహమని పిలువఁబడు మహాక్రతువు నొనరించెను. అన్ని వర్ణములవారును అహోరాత్రములు పంచభక్ష్య పరమాన్నలముతో భోజనములఁ జేయుచుండిరి. అనుదినము నేరాజేంద్రు నకో కబురంపుటయు, నాతఁ డానాటికి వలయు సంభారములను బంపు టయు జరుగుచుండెను. ఒకనాఁటి రాత్రి కొన్నివేలమంది భోజనము నకు వచ్చినసమయమున వంటబ్రాహ్మణుఁడువచ్చి ‘ రాత్రిభోజనము లకు ఘృతము చాలదు ’ అని చెప్పెను. రాత్రివేళ యెవరికి కబురం పిన నెవరు నేయి పంపఁగలరు ? భీమకవి యాలోచించి, యీపద్యముఁ జదివెను——

శా. భీమేశప్రముదంబుసేయఁ గవియా భీమన్న సప్తాహము
ల్నీమంబొప్ప నొనర్చుచుండ నిచటన్ నేయెంతలేకుండెనీ
ధామంబందున నీరిమేల్ ఘృతముగాఁ దత్త్వంబుమాటించిన౯
ధీమంతుల్గొనియాడ నేయివగుమా ధీసప్తగోదావరీ.

ఇట్లనునరికి గోదావరి యంతయు ఘృతమయమై పోయెను. బ్రాహ్మణులా యాద్యమును పాత్రములతోముంచి గొనివచ్చి బ్రాహ్మ ణులకుఁ దదితరులకుఁ గూడ సంతృప్తిఁ గలుగునట్లు భోజనములిడిరి. అందఱును భోజనముల నొనరించి, తమ తమ గృహములకు వెడలి నంతనే భీమకవి మఱల నీపద్యముఁ జదివెను—

ఉ. వచ్చినవార లందఱును వారనితృప్తి భుజించివైచినన్
జెచ్చెర సంస్తుతించిరిఁక జెందుమునీ తొలిరూపు నీరమై
పెచ్చుపెఱింగి జీవతతిఁ బ్రీతివహింపఁగ నింద్రజాలమం
త్రిచ్చువిసప్తగౌతమి ! ముదంబలరారఁగ మన్నియుక్తమై .

వెనువెంటనే ఘృతమయమైయున్న గోదావరి యథాప్రకార ముగ జలమయమయ్యెను. కవిరాక్షసుఁడగు భీమకవి యొనరించిన సప్తసప్తాహ వైభవమునుగూర్చి ఆప్రాంతజనులు చిరకాలము చెప్పు కొనిరి.

---

## 13. గోపరాజు రామమంత్రి

వేములవాడ భీమకవి కాలముననే కాకతీయ గణపతిదేవుఁ డను రాజుకడ గోపరాజు రామమంత్రి లేక రామప్రధాని యనఁబడు నియోగిబ్రాహ్మణుఁ డుండెను ఈరామమంత్రి స్వశాఖీయులగు నియోగిబ్రాహ్మణులకే యుపాధికల్పింపఁ దలంచినవాఁడై యదివఱకు కంసాలుల యధీనములోనున్న కరిణీకపుఁబనులను నియోగిబ్రాహ్మణుల కిప్పించెను. అంతమాత్రమేగాక కృష్ణానదీతీరమునఁ బెక్కుభూదాన ముల నిప్పించెను. భీమకవి యామంత్రిసత్తముని కడ కరిగి యీపద్యములఁ జెప్పెను.

సీ. వీఁడెపో దుష్పారివీరమంత్రి కఠోర
భూధరంబులకు దంభోళిధార
వీఁడెపో కవిరాజ గాఢదారిద్ర్యాంధ
కారంబు లడఁగించు కమలహితుఁడు
వీఁడెపో బహునీతివిద్యానిరూఢిచే
సురగురుగెల్చిన శుభకరుండు
వీఁడెపో చతురబ్ధివేష్టితావనిఁగల్గు
బహుమంత్రికులసార్వభౌమమూర్తి

గీ. ఈతఁడే సర్వదేవతాప్రీతికరుఁడు
ఈతఁడే గోపరాట్కుల శీతభానుఁ

డని కవీంద్రులు పొగడంగనతిశయిల్లె
మంత్రి జంభారి రామయామాత్యశౌరి.

సీ. తనకీర్తి యాచంద్ర తారార్కముగ మంత్రి
కులులకుఁ గరిష్ఠకములనొసంగి
నతిథిసంతర్పణ మనుదినంబునొనర్చి
ఖ్యాతిగా హరహరప్రీతిఁజేసె
వర్ణాశ్రమాచార నిర్ణయంబులనెల్ల
వేదోక్త రీతిగా వెలయఁజేసె
ఘనవిప్రవందిమాగధ కవీంద్రులనెల్ల
నగ్రహారములిచ్చి యాదరించె

గీ. నతఁడు శ్రీగోవరాజన్య యాబ్ధిచంద్రుఁ
డనఁగ విలసిల్లెఁ దనపాటి ఘనులుపొగడ
మంత్రి దేవేంద్రుఁడనఁగ స్వతంత్రలీల
మంత్రికులహేళి రామయామాత్యమౌళి.

ఈ రామమంత్రి భీమకవికి శిష్యుఁడై రసవత్తరమైన కవిత్వముఁ జెప్ప గలిగెను. రాజువలన నధికారదానముఁ బరిగ్రహించినాఁడని రామ మంత్రిని గొందఱు వైదికబ్రాహ్మణు లాక్షేపణమొనరించిరి. ఆయధి క్షేపము నాకర్ణించి యిట్లనెను—

ఉ. మానఘనుండు, బ్రహ్మకులమండనమూర్తి పరోపకారి, దు
ర్దాన్న దురాన్నముల్ గొనఁడు, తప్పఁడు స్వామిహితోపకారముల్
దీనులఁద్రోచు బాంధవవిధేయుఁడు డస్సియు వేఁడబోఁడుతా
మానినవేడ్కతోడను నియోగికినిచ్చిన దానమల్పమే.

ఉ. వ్రాయుటచిత్రమా! విక్రృతవైదికమా! నిజదార రక్షణో
పాయముకై నియోగి యిలఁబార్థివసేవ యొనర్చినంతనే
పాయునె వర్ణశీలములు? పాయక యెప్పుడు చిత్రగుప్తుఁడున్
వ్రాయఁడె యెల్లలోకముల వారలుచేసిన పుణ్యపాపముల్.

ఒకనాఁడు గణపతిదేవుని కడకు వాసుదేవభట్టారకుఁడను వయ్యాకరణివెళ్ళెను. ఆ సమయమునకే భీమకవియు నటకేగి, రాజుపైఁ గొన్ని పద్యములఁ జెప్పగా నారాజపుంగవుఁడు సంతోషభరితాంతరంగుడై సత్కరించెను. భీమకవిని సత్కరించినట్లు తన్ను బహూకరించలేదని కుపితుఁడై యా వయ్యాకరణి 'నేను మాత్రముఁ బద్యములల్లలేనా?' యని యీపద్యముఁ జదివెను—

చ. అవగతశబ్దశాస్త్ర చయులైన మహాత్ములు పండితోత్తముల్
భువనతలంబునం దధికపూజ్యులు, వారటులుండగూటికై
నవనవకల్పనా విధిక్షణత్వముదోఁప నబద్ధమాడునీ
కవులిల దానపాత్రులయి గౌరవమందుట చూవెచిత్రముల్.

అప్పుడు భీమకవి క్రోధోద్దీపితచిత్తుఁడై —

చ. కవికమలాసనుండు, త్రిజగత్పతియైన పినాకపాణియుఁ
గవియెతలంపగా గవులుకారె పరాశర బాదరాయణుల్
కవికృతపుస్తకగ్రహణ గర్వితులల్పులె? పూజలందగా
గవులట? దానపాత్రులఁట కారట! యిట్టివిపోవిచిత్రముల్.

ఆ వ్యాకరణ శాస్త్రజ్ఞుఁడు 'భీమకవీ! మహాగొప్ప కవీశ్వరుఁడవే' యని కోపముఁబట్టలేక పలికెను 'తమవ్యాకరణములో వీకి, పీకి తేడా లేదుకాఁబోలు' నని భీమకవి హేళనపూర్వకముగా ననెను. ఆ వయ్యాకరణి 'కవిగారూ! వవయోరభేదః అనుసూత్ర మున్నది గాన యట్లంటి' నన అట్లయిన మిమ్ము పాసుదేవ భట్టారకుఁడు గారూ! అని పిలవవచ్చు నన్నమాట.' అని భీమకవి వాక్రుచ్చెను. అతఁడు భీమకవితో వాదించుటవలనఁ బ్రయోజనములేదని గ్రహించి, మాఱుమాటాడక తనమార్గమునఁ దానుబోయెను.

## 14 మైలమభీమన.

రణతిక్కన పోలమాంబ దత్తత తల్లియనియు, మైలమాంబ తల్లియనియు, నీమెకు భీమనయను కుమారుఁడు కలఁడనియు, జెప్పు దురు ఈ మైలమభీమన కూడ మహాశూరుఁడై మనుమసిద్ధిరాజునొద్ద దండనాధుఁడై యుండెనని చెప్పుదురు కొందఱు మైలమభీమన శాలి వాహనశకము ౧౨౦౫ సం॥రములోని వాఁడని చెప్పుచున్నారు. ఏది యెట్లున్నను మైలమభీమనను గుఱించి వేములవాడ భీమకవి యీక్రింది పద్యమును జెప్పెను.

చ. గరళపుముద్ద లోహమవగాఢ మహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్నికొల్మి యురగాధిపు కోఱలుపట్టుకార్లు ది
క్కరటిశిరంబుఁ దాయిలయకాలుఁడు కమ్మరివైరివీరసం
హరణగుణాభిరాముఁడగు మైలమభీమన ఖడ్గసృష్టికిన్.

---

## 15. బసవపురాణము.

శ్రీకృష్ణదేవరాయల కాలముననున్న పిడుపర్తి సోమనాధుఁడు రచించిన యీక్రిందిపద్యమువలన వేములవాడభీమకవి బసవపురాణ మునురచించెనని స్పష్టమగుచున్నది కాని యీబసవపురాణము తెను గుననున్నట్లు కానరాదు. భీమకవి బసవపురాణమును కర్ణాటభాషలో వ్రాసెనని కొందఱు చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. ఆకాల మున దెనుఁగు కర్ణాటభాషలకు విశేషభేద మున్నట్లు కానరాదు. శ్రీనాధుఁడు భీమఖండములో నిట్లు వ్రాసినాఁడు—

గీ. ప్రౌఢి పరికింప సంస్కృతభాషయందు
పలుకు నుడికారమునఁ దెల్గుబాసయందు

రెవ్వరేమన్న నందుర్నా కేల కొఱత
నాకవిత్వము నిజము కర్ణాటభాష.

పిడుపర్తి సోమనాథుఁడు రచించినపద్యము—

సీ. విరచించె జైమినివేదపాద స్తవం
బొక వాదమునను వేదోక్తి నిలిపి
హారభక్తిమైదికం బనిశ్రుతులిడి చెప్పెఁ
బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత
నరవి శ్రీనాథుఁడా చరితపద్యప్రబం
ధముఁజేసె ద్విపదలు తఱచునిలిపి
యాలందు పద్యకావ్యముఁజేసె నైషధ
మంచిత హర్షవాక్యములు సొఁకి
గీ. సోమగురు వాక్యములువెట్టి భీమసుకవి
గరిమ బసవపురాణంబు గణనఁజేసె
గానఁ బూర్వకావ్యము వేర్వేఱుగతి రచించు
వారికాది కావ్యోక్తులు వచ్చినెగడు.

భీమకవి తన కన్నడబసవపురాణమున నిట్లు వ్రాసికొనియున్నాడు.

విమల సద్గురుసేవె యలిజం
దమ భజన యలిలింగనిష్ఠా
నమతె యలితను మంధనంగళనిత్య భవభక్తి.
సమయవార్ధి వివర్ధనోళ్యజ
హిమగు శివకవిదేవనాత్మజ
సుమతి భీమను భయకవిత్వసమర్థను సురువడె.

బసవపురాణ రచనకాలమును గుఱించి, యా పురాణమున వ్రాసిన పద్యము—

కోవిదరు కేలోళ్ళి తెనమడు
దేవనిధ్యంబరెండు సంఖేల
ళోవిశక వరుషాంగళాగళుసౌమ్యవప్సరద
శ్రావణ బహుళపక్ష దశమీ
జీవవారదోళాది వృషభేం
ద్రావతారద బసవ చరితేసమాప్త యాయిత్తు.

మఱియు నందు—

ఇదుసకల మహేశ్వరామళ
పదవయోజవరాగమదష
ట్పదయెనిపాల్కురికె సోమేశ్వర నకారుణ్య.
ఒదవి నఖిళాపవ్రిపూరిత హృదయ భీమనకవి ప్రణీతా
భ్యుదయ బసవపురాణమొకధళ అష్టమాశ్వాస.

అని యున్నది.

---

## 16 రాఘవపాండవీయము

వేములవాడ భీమకవి "రాఘవపాండవీయు" మను ద్వ్యర్థి కావ్యము రచించి, రాజనరేంద్రున కంకితమొనరింపఁ దలంచి రాజ్మహేంద్రవరమున కేగెను. రాజనరేంద్రుని యాస్థానమున నపుడు నన్నయభట్టు కవిగానుండెను. రాజనరేంద్రుని దర్శనమొనరించుటకు భీమకవి కెట్టియవకాశమును లభింపకుండెను. నన్నయభట్టుతో మైత్రి నలిపినఁగాని, రాజ సందర్శనభాగ్యము లభించదని యెఱింగి, భీమకవి నన్నయభట్టుకడ కేగెను.

నన్నయభట్టు కాతఁడు తానురచించిన రాఘవపాండవీయముఁ జూపెను. ఆ గ్రంథమును జదివి, నన్నయభట్టు "ఈగ్రంథము

నీభీమకవి చాల రసవంతముగ రచించినాఁడు ఈ కావ్యముఁజూచి, రాజనరేంద్రుఁడు నన్నుగూడ ద్వ్యర్థి కావ్యమురచింపుమని యాన తిచ్చు' నని యెంచి, మత్సరగ్రస్తుఁడై తెఱకుసాకులఁ గల్పించుచు కాలయాపనముఁ జేసి, తుదకొకనాఁడు 'ఏదీ! ఆ కావ్యమును నేను ముందుగాఁ జదివి, పిదప రాజుతోఁజెప్పెద' నని పలికి, ఆ గ్రంథ మును గాల్చివై చెను.

భీమకవి యెప్పు డడిగినను 'రాజేంద్రుఁ డింకనుజూచుట కాలే' దని చెప్పుచుండెను. ఆ కాలముననే నన్నయభట్టు భారతాం ధ్రీకరణమునకుఁ గడంగియుండెను. భారతమున మొదట నాతఁడిట్లు వ్రాసికొనియున్నాఁడు—

చ. అమల సువర్ణశృంగ ఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేదవిప్రులకు దానము చేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారతకథా శ్రవణాభిరతిన్ మదీయ చి
త్తము నని శంబు భారత కథాశ్రవణ ప్రవణంబ కావునన్.

క. జననుత కృష్ణద్వైపా
యన మునివృషభాభిహిత మహాభారతబ
ద్ధ నిరూపితార్థ మేర్పడ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్.

భీమకవికిఁ దుదకు నిరాశజనించి, తన్ను నన్నయభట్టు వంచించి, రాఘవపాండవీయమును నాశనము చేసెనని గ్రహించి కుపితుఁడై యాతని కడకరిగి 'నీవునన్ను మోసగించి, నాగ్రంథమును దగులఁ బెట్టినావు. ఈ పాపము నిన్నుకట్టి కుడుపకపోదు. నీవు ప్రారంభించిన భారతాంధ్రీకరణమున మూఁడవపర్వము పూర్తిగాకుండగనే కృతాంత మందిరమున కతిథివయ్యెదవు. అరణ్యపర్వము పూర్తిగాకుండగనే మృత్యువుపాలయ్యెద' వనుచు నన్నయభట్టు చేతిలోనున్న యాంధ్ర

శబ్దచింతామణి యను వ్యాకరణగ్రంథము లాగుకొని చించి, గోదావరిలోఁ గలిపెనట అందువలననే యప్పకవి—

గీ. భారతముఁ దెనుఁగించుచుఁ దా రచించి
పట్టి రాఘవపాండవీయంబు నడచె
ఛందమునఁడంప నీఫక్కి సంగ్రహించె
ననుచు భీమన యెంతయు నడఁచెదాని.

నన్నయభట్టు, భీమకవి మఱికొన్నిరోజులు రాజమహేంద్రవరమున నున్నచోఁ దనప్రాణములకే భంగమువాటిల్లునని యెంచి, యీపద్యము రచించి యొకనిద్వారా భీమకవి కంపెను నిందాపూర్వకమైన భావముఁ గల్గియున్న యీపద్యమును చదివికొని భీమకవి 'నేనొసఁగిన శాపము నాతఁడు తప్పక యనుభవింపవలసినదే. ఎన్ని వ్రాసికొనినను, ఎన్ని తిట్టినను నేనీక లెక్కసేయువాఁడ గాను' అని వెడలిపోయెను. ఆతని శాపము ననుసరించియే నన్నయభట్టు భారతమున నరణ్యపర్వమునే రచించుచు కాలధర్మము నొందెను. ఆ పద్యమిది—

చ. మతిభ్రమ నీఁగి బేర్మిసిరి మానముపెంపున భీమునిన్ బృహ
స్పతి రవిఁగర్ణు నర్జునుగపర్ది సుయోధనుఁబోల్ప బున్నవా
మతకరిఁ దీక్ష్ణు దుష్కులునమానుషు భిక్షుఖలాత్మునెంచ వా
క్పతి పుళిన్ బలిన్ గొమరు సామిని మేరువునబ్ధిఁబోల్చెదన్.

---

## 17. పింగళీ సూరన్న.

వేములవాడ భీమకవి విరచితమైన రాఘవపాండవీయ మెచ్చటను లేనందునఁ బింగళి సూరన్నఁ దానురచింపఁబూనెను. ఆతఁడు గ్రంథారంభమునఁ బీఠికయం దిట్లు వ్రాసికొని యున్నాఁడు.

శా. రెండర్థంబుల పద్యమొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
కుండుందద్గతిఁ గావ్యమెల్లనగునే నోహో యనం జేయదే

పాండిత్యంబున నందునుం దెనుగు కబ్బంబద్భుతంబందు శ్రీ ద
క్షుం డెవ్వాడిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్.

ఉ. భీమనతొల్లి చెప్పెనను పెద్దలమాటయె కాని యెందు నొం
డేమియు నేయెడ న్నిలుచు టెవ్వరు గానరటుండనిమ్ము నా
నామహిత ప్రబంధరచనా ఘనవిశ్రుతి నీకుఁగల్గు ట
న్నామది తద్ద్వయార్థ కృతిపై స్పృహయుం గలదంచు నెంచెదన్.

పింగళి సూరన్న రాఘవపాండవీయము సుప్రసిద్ధమైనది. భీమకవి రచించెనని చెప్పుచున్న రాఘవపాండవీయ మిప్పు డెచటను గానరాదు. ఇందులకు నన్నయభట్టే కారణమని చెప్పుదురు.

---

## 18. కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవి కవిజనాశ్రయమును రచించెనని చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. ఈ కృతినొందినది మల్లియరేచన్న యనుజైనకోమటి. ఈతఁడు భీమకవికిఁ జాలధనమొసంగి, బహూకరించెనట. కొందరు చరిత్రకారులు కవిజనాశ్రయమును గోకర్ణుఁడు వ్రాసెనందురు. ఆగ్రంథమునందు మల్లియరేచన్నయే కర్తయైనట్లు తెలియుచున్నది. ఆ గ్రంథమున—

క. అనవద్య కావ్యలక్షణ
మొనరంగాఁ గవిజనాశ్రయుండు మల్లియరే
చన సుకవి కవిజనాశ్రయ
మనుబంధము తెనుఁగు శాసనరుచుఁగ జెప్పెన్.

క. పరగిన విమలయశోభా
సుర నిరతుఁడు భీమనాగ్రసుతుఁ డఖిలకళా

పరిణతుఁ డయ్యెను భూసుర
వరుఁడు ప్రసాదోదిత ధృవశ్రీయుతుఁడై.

క. అనమాన దాన రవి తన
యనమానోన్నతుఁడు యాచకాచరణుడు పా
ణసమాన మిత్రు డీకృతి
కి సహాయముగా నుదాత్త కీర్తి ప్రీతిన్.

మఱియొకచో నిట్లున్నది—

క. వేములవాడను వెలసిన
భీమేశ్వరు కరుణగల్గు భీమసుకవినే
గోమటి రేచనమీఁదను
నీమహిఁ గవులెన్నఛంద మెలమి రచింతున్.

ఈపద్యమువలన కవిజనాశ్రయమునకు భీమకవియే కర్తయని బోధపడుచున్నది. గోకర్ణుడు రచించెననుటకుఁ దగిన నిదర్శనము లెవ్వియు గానరావు.

'ఉ. ద్వీపులదృంచి, విశ్వజగతీపతి యుత్తమకీర్తి జాంబవం
ద్వీపమునందు గోవులకు నిమ్మగజేయుటకర్ణ బ్రసన్నుడై
గోపతిధేను నవ్విభునకుం దనవైభవ మిచ్చెగాక యే
భూపతు లీవదాన్యగుణ బుద్ధులనిట్లు వహించి రుర్వరన్.'

క. నీకరవాలముపాలై
నాకంబునకరిగి రాజనారాయణయా
భూకాంతు లెంతచనునో
నాకవిటోత్తముల గర్వమడతురు కడిమన్.

—

# 19. నెల్లూరు వర్ణనము.

వేములవాడ భీమకవియు ఖడ్గతిక్కనయు బంధువులగుటచే, నాతఁడు తఱచుగా నెల్లూరున కేగుచుండెను. నెల్లూరిపై నాతఁడీక్రిందిపద్యముల నిట నుదహరించుచున్నాము. ఇవి భీమకవి విరచితములు కావని కొందఱి యభిప్రాయముగాని, అట్టియభిప్రాయమునకు హేతువేదియుఁ గానరాదు.

సీ. పాలించు నేవీట బ్రహ్మాదివంద్యుండు
లీల మూలస్థాన లింగగురుఁడు
దీపించు నేవీట దేవాలయంబులు
ధావళ్య నవసుధా ధౌతములుగఁ
బ్రవహించు నేవీట బ్రహ్మాండ కర్పరం
బొరసి మిన్నులుముట్టనున్న పెన్న
చెలువందు నేవీట జిరకాలజీవన
స్వర్ణాలచెఱువు సంపూర్ణమగుచుఁ

గీ. బ్రజలకును నున్కి సకలసంపదలకున్కి
భోగములపీఁడు సురపతిపురికి నీడు
నమ్మికలకొంకి వైరులఁ జిమ్ముకొంకి
భాగ్యనికరంబు నెల్లూరు పట్టణంబు.

సీ. ధీరుఁడై యేలెఁ దిరుకాళదేవుండు
తిక్కనాయకుఁ డేలెఁ దేజమెసఁగ
మన్మసిద్ధనయేలె మహిమతో దీపించి
దాదినాగనయేలె ధర్మరీతి
మనుగొండ గోపాల మనుజాధి పతియేలె
స్వర్ణదేవుం డతి ప్రభగనేలె

గోపీనాథుం డేలె గుణసమానాశ్రిత
రమణతో శ్రీరంగరమణుం డేలె
గీ. తిక్కనయును మఱియుం గొన్ని దినము లేలె
నేలె మీతండ్రి మర్యాద లెల్లఁ గలుగ
గడక నీ వేలి తండ్రికం బ మించి
శరధిగంభీర సంగమేశ్వరతలేంద్ర.

సీ. చరియించితినిగాని జగము మూలస్థాన
పరమేశ్వరునివంటి భక్తవరదు
విహరించితినిగాని వివిధభూములు వల్లి
కొంట నాథునివంటి కూర్పువేల్పు
పరికించితిని గాని బహుదేశము లనంత
పద్మనాభునివంటి భవ్యమూర్తి
వీక్షించితిని గాని విశ్వమంతయుం బెన్న
నదివంటి దివ్యపుణ్యస్రవంతి
గీ. అరిగితిని గాని దేశదేశాంతరముల
వేదగిరివంటి పావనోర్వీధరంబు
గాన నిన్ని విశేషములు గలిగి ధరం బ్రసి
ద్ధికెక్కెం ద్రిదివగరిమ సింహపురము.

సీ. ఆపట్టణంబున సమరంగం దూర్పున
మాకందచందన మహితవనము
ఆ నగరంబున కటు దక్షిణంబునం
జెలువారు వేమూలపట్టిబాపి
ఆ యూరి పడమట నంభోజరాజివేం
బ్రకటంబైన తటాకమమరు

నొప్పారు నవ్వీటి కుత్తరదిశయందు
మున్నీటికెనయైన పెన్నయనరు

గీ. కలిమి నారాజధాని మార్గంబ దెన్న
బహుళగంధర్వ సింధుర బంధురంబు
రతనపుం బొమ్మలప్పురి రమణులనఁగ
వినుతికెక్కెను నెల్లూరి విధవమహిమ.

సీ. ఏపట్టణంబున నెన్నఁగ మున్నూట
యఱువది దేవాలయంబులుండు
ఏపట్టణంబున రూపింపనన్నియు
నీరేడు బావు లింపారుచుండు
ఏపట్టణంబున నెల్లనూనవులుఁ బ్ర
శస్తిఁగాంచిరి నెఱజాణలనఁగ
ఏపట్టణంబున నేకాలములఁ బెన్న
కాల్వలచేత ముక్కాఱుఁబండు

గీ. శివుని కృపఁబుట్టె వేమాల శెట్టిబావి
పరగజగమెల్ల నెఱుఁగనే పట్టణమున
నట్టిపట్టణములను సౌఖ్యములకునికి
పట్టనందగు నెల్లూరు పట్టణంబు.'



## 20. నన్నెచోళదేవుఁడు.

కావేరీనదీతీరమున నొరయ నగరమును రాజధానీనగరముగఁ జేసి కొని నన్నెచోళదేవుఁడు చిరకాలము రాజ్యపాలన మొనరించి, యశస్వి లకుఁడాయెను. ఈతఁడు క్రీ. శ. ౯౪౦ సంIIరము వాఁడని చరిత్ర కారులు వ్రాసియున్నారు. ఈతఁడు కవి; లాక్షణికుఁడు కూడనై

యుండెను. గీర్వాణమునం దసమాన పాండిత్యముగల యీ నన్నెచోళ దేవుని వేములవాడ భీమకవి సందర్శించుటకేగునప్పటికిఁ గుమారసంభవమును విరచించియుండెను—

వేములవాడ భీమకవి కుమారసంభవమును గూర్చి యిట్లు వ్రాసినాఁడు—

" చ. రవికులశేఖరుండు, కవిరాజశిఖామణి, కావ్యకర్త, స
త్కవి, భువినన్నెచోడుఁడట ! కావ్యము దివ్యకథన్ గుమారసం
భవమట ! సత్కథాధిపతి భవ్యుఁడు జంగమమల్లికార్జునం
డవి చరితార్థయోగధరుఁడట్టె ! వినం గొనియాడజాలదే ? '

సీ. కుతలంబు నిడుకొనఁ గొలకొండకాసిల్పి
శరనిధిఁ దెచ్చిరి సగరసుతులు
మిన్నులపైఁ బాఱుచున్న యేరిలఁ దెచ్చి
వారాశినించె భగీరథుండు
గోత్రాచలములెత్తికొనివచ్చి కడచన్న
రత్నాకరముఁగట్టె రాఘవుండు
జలధి మహీసతి మొలనూలుగాఁ జుట్టి
పాలించె గరిగరికాలచోడు

గీ. వరుసనిట్లు సూర్యవంశాధిపతులయందు
నిధియమేరగాఁగ నిఖిలజగము
నేలి చనినవారి కెనవచ్చుసుశ్లాఘు
ధీరుఁడు నన్నెచోళజనవిభుండు.

చోళదేవుఁడు భీమకవి రచనమునకెంతయు నలరి, భీమకవిని సన్మానించెను. ఈతని తండ్రి చోడబల్లిదేవుఁ డనియుఁ, దల్లి శ్రీసతియనియు, నాతఁడు రచించిన కుమారసంభవమున నుదాహృతమైన యీపద్యము వలన స్పష్టమగుచున్నది—

చ. అరినరపాలమాళి దళితాంఘ్రియుగుండయు పాకనాటియా
రిరువదియొక్క వేయిటికధీశుఁడు నాజను చోడబల్లికిన్
జిరతరకీర్తి కగ్రమహిషీతిలకంబన హైహయాన్వయాం
బురశశిరేఖయైన గుణభాషిణి శ్రీపతికిన్ దనూజుఁడన్.

---

# 21 చోడగంగు

నన్నెచోళదేవునకు చోడగంగు పినతండ్రికుమారుఁడు. ఈచోడగంగు నన్నెచోళునకు దండనాథుఁడై జగదేకప్రఖ్యాతిఁ గాంచెను. ఈతని ప్రభుభక్తి పరాయణతకు సంతసించి నన్నెచోళుఁడు తిరుచనాపల్లిలోఁ గట్టినదుర్గమునకు అధిపతిఁజేసెను. చోడగంగుకూడ నన్నెచోళదేవుని వలెనే కవితచెప్పుచుండువాఁడు. భీమకవి తిరుచనాపల్లికిఁ బోయి, చోడగంగు దర్శనమొనరించి యీక్రింది పద్యములఁ జదివెను.

చ. అనిమొన జోడగంగడు మురారి బకారి నరుండుమాదిరిజాం
డనఘన చక్రతోమల శరాసనకుంతము లల్కఁబూనివ్రే
యను వడిడాయనేయఁ బొడువన్ గళమస్తరవత్సమర్మముల్
తునియలె? నుగ్గుగావె? యెతదూరవె? నాటవె? వైరివీరులన్.

ఉ. భోజుఁడుమంకు, ధర్మజుఁడు బొంకు, శశీపతి రంకుకల్వపూ
రాజుకళంకు, దైవతధరాజముడొంకు పయోధియుంకు, నర
భోజభవుండు వంకు, ఫణిభూషణదేవుఁడు సంకు, పద్మినీ
రాజ హితుండుక్రుంకు సరిరారుగుణంబుల నీకుధారుణిన్.

తా. మంకుతనము గలిగియున్నందున భోజరాజు నీకెనకాఁడు. కురుక్షేత్ర సంగ్రామసందర్భమున ససత్యముఁ బలికినందున ధర్మరాజనృతవాదియయ్యెను. జారుఁడగుట దేవేంద్రుఁడు నీకు సరికాఁడు. కళంకముఁ గలియుంటచేఁ జంద్రుఁడును నీకు సరికాఁడు. క్రుంగియుండుటచే

మేరుపర్వతముకూడ నీకు సరికాదు. ఇంకునట్టి గుణముండుటచే సాగరముకూడ నీతోఁ బోల్పదగినదికాదు.

చోడగంగు భీమకవి పద్యముల నాకర్ణించి, సంతుష్టాంతరంగుఁడై యాతని నుచితరీతిని సత్కరించెను.

---

## 22. భూతవైద్యుఁడు

భీమకవి వాసస్థానమైన ద్రాక్షారామములో నాతని పినతండ్రి కుమారుఁ డుండెను. ఆతనిపేరు విఠలదేవుఁడు. ఆ విఠలదేవుఁడు పుట్టు పిఱికిపంద. ఆతని భయమునకుఁ బిఱికి తనమునకుఁ దగినట్లు తఱచుగా భూతములు, పిశాచములు నాతనిని సోకుటయు, నతఁడు తఱచుగా మంచముపట్టుటయు జరుగుచుండెను. తలిదండ్రులుకూడ నిందులకు తోడగునట్లాబాలునికి విద్యాబుద్ధులు గఱపింపక, లోకజ్ఞానశూన్యుఁడగు మూర్ఖునిగాపెంచిరి. విఠలదేవుఁ డొకప్పుడు జ్వరపీడితుఁడై యుండఁగా నొకభూతవైద్యుఁ డాగ్రామమునకేగి, యాపూట తిండికిఁగూడ చాలినంత ధనములేనివాఁడై యేమిచేయుటకును దోఁపక వీధులవెంబడి తిరుగుచుండగా విఠలదేవుని యార్తనాదము విననయ్యెను.

భూతవైద్యుఁడు లోనికేగి, ఆబాలుని మంచముకడ నిలువఁబడి 'ఓంహ్రీం క్లీం హ్రూంఫట్ స్వాహా, హూంత్ హూంత్! శాకినీ ఢాకినీ మోహినీ ఓం' అని బిగ్గఱగా నందఱును హడలిపోవున ట్లరచెను. ఇరుగుపొరుగు అమ్మలక్కలందఱును జేరి 'అవునమ్మా! ఆ కుఱ్ఱవా డెప్పుడూ ఇంతే. భూతముసోకినది. నిక్కువము. భూతవైద్యము చేయించు' డని సలహానిచ్చిరి.

ఆ వైద్యుఁడు 'మీకు వలయుచో పద్మమువేసి చూపింతును. మూడు నిమిషములలో భూతమును బోఁగొట్టుదును.' అని వారికి

నచ్చచెప్పి, పద్మమువేసి "ఆఁ! ఆగు! ఎవరునీవు, చెప్పు, కాకపో యిన చింతబరికెతో నీవుఁ బగులగొట్టెదను. ఆ! ఎవరునీవు? వేములవాడ భీమకవివా?" అనెను "అదేమి చిత్రమమ్మ! భీమకవి పినతండ్రి కొడుకుపైఁ బ్రయోగముచేయు టెందైన వినినామా? కనినామా? ఎంత చిత్రమమ్మా! ఏమి విడ్డూరమమ్మా!" అని చెప్పకొనసాగిరి. దేశాటన మొనరించి నాఁడేతిరిగివచ్చిన భీమకవి కీవార్త తెలిసెను.

ఆతఁడు తిన్నగా భూతవైద్యునికడ కరిగి, "ఏమయ్యా! వైద్యుఁడా! నేను ప్రయోగముచేసినానని యందఱితోను జెప్పుచు న్నావట, ఏదీ పద్మమువేసి చూపు" మని యడిగెను. ఆభూత వైద్యుఁడు భీమకవి తన్నేమని శపించునోయని భయపడి, యేదో యొక మిషపెట్టి, యిప్పుడే తిరిగివత్తునని చెప్పి వెడలిపోయెను. భీమకవి యంతట నాబాలుని పరీక్షించి "జ్వరముతక్క మఱేమియులేదు. ఈవైద్యుని హడావిడివలన నదిమఱింత తీవ్రస్వరూపము, దాల్చినది." అని ఔషధమిప్పింపగా, నది మటుమాయ మయ్యెను. "అయ్యో! నిజముగా నేను సమయమున కదృష్టవశమున వచ్చితిసగాని లేకున్నచో నేను ప్రయోగము చేసితినను నిందనాతలపైఁ బడునుగదా!" యని యీక్రింది పద్యముల రచించెను—

ఉ. పోఁడిమి మంత్రముల్చదివి భూతములన్ వదలింతుమంచు నా
 డాడను మోసగాండ్రు మృషలాడిధనంబుగడింప జూతురీ
 పాడుగుణంపు మానిసులఁ బావుల చెంతకుఁజేరనీక వం
 డ్లూడఁగ దౌడ(వ్రే)సినను నొందరు పాపమొకింత యేనియున్.

ఉ. వచ్చినవాఁడు భూతమయి శాకిని కొరకుతార వేలనో
 పచ్చలితప్రతీవ్రగతి బాధలుపెట్టునటంచు పామరుల్
 పిచ్చితలంపులన్ దవిలి భీతిలుచుండెదరీ ధరాస్థలిన్
 జచ్చినవాని కెక్కడిదిశక్తి? వివేకము నందరేజనుల్.

మ. కవిమాన్యుండు శపించెనేని యదియే గాఢప్రయోగంబుగా
భువినెవ్వారిని నాశనంబునలుపుం బుణ్యాత్ముఁడే సజ్జనుల్
కవిసత్కారమొనర్చి సంపదలు భోగంబుల్ సౌఖ్యసంతానముల్
దవులన్ బొందుట దక్షవాటికవిరాట్త్వంబె చాటించెడున్.

చ. అనిమొనఁ గూలిపోమఱల నాయువొసంగితిఁ దిక్కమంత్రికిన్
గనికరమొప్ప సంపదల గంగునకిచ్చితిఁ దొల్లి కోపమున్
బెనఁగొని పోతరక్కసునిఁ బెట్టితిశాపముఁ జచ్చునట్లుగా
ఘనుఁడను వేములాడ కవికాంతుఁడ భీమవరప్రసాదుఁడన్.

ఉ. మానుగబంధుకోటి నభిమానమునన్ దిలకింతుఁగాని లో
నూనిన కోపవేశమున నొప్పిశపింపగ విత్రలయ్యుఁ కిన్
బూని ప్రయోగమున్ సలుపఁబూనితినం చపనిందఁజెందఁగా
లేనని సప్రమాణముగ లేఖినిముట్టి వచింతు మాటికిన్.

---

## 23. నల్లసిద్ధిమహీపాలుఁడు.

నల్లసిద్ధి మహీపాలుని కోరికచే భీమకవి శతకంధర రామాయణము రచించెనని వాడుక. కాని ఆ గ్రంథ మిప్పుడెచ్చటను కానరాదు. ఒకటిరెండు సంవత్సరములు భీమకవి నల్లసిద్ధి నృపాలునికడ నుండెను. ప్రథమమున నాతని కీరాజు దర్శనము సులభముగాఁ గాలేదు. ఆస్థాన కవియైయున్న యాతఁడు చాలదినములు త్రిప్పుచున్నందున విసుగుఁజెంది, భీమకవి యాతనికడకేగి "ఓయీ! రాజదర్శనముఁ జేయింతువా? లేక శపింపుమందువా?" అని కఠినముగా నడిగెను.

ఆతఁడంత భయకంపితుఁడై "అయ్యా! భీమకవీ! నిగ్రహానుగ్రహసమర్థుఁడవగు నీకెందైన నాటంకముగలదా? నేను రావల

యునా ? నాసాయము కావలయునా ? ' అనెను. ' ఔను. అక్కఱ లేదు గానినన్ను తెలియనివారు నిరోధించి రేని యుగ్రుండనై శపింపవలసి వచ్చును. అనవసరముగానితరులఁగష్టపెట్టుట నాయభిమతముకాదు. ' అని పలుకగా, నాకవి విస్మితుండై మాఱుమాటాడక రాజదర్శనముం జేయించెను. నల్లసిద్ధిరాజు అంతకుమున్నే భీమకవి యశస్సునాకర్ణించి యుంటచే గౌరవించి ఆదరించెను.

నల్లసిద్ధికిని రాజరాజునకును నొకప్పుడు మహాసంగ్రామము వాటిల్లెను. ఆ రణమున నల్లసిద్ధమహీపతియే విజయమునొందెను. భీమకవి యాసంగరమునిట్లు వర్ణించెను.

ఉ. వాండిమినల్లసిద్ధి జనవల్లభుఁ డోర్చినరాజుభీతుఁడై
యాంధ్రనుగానకుండ వృషభాంకముఁ బెట్టుకొనంగఁ జూచిలో
నేండిదియేమి నీవనుచు నెచ్చెలులెల్ల హసింపనంతలో
మూండవకంటితోడి దొరమూర్తివహించిన మ్రొక్కెఁరంగనల్.

భీమకవి విరచితమైనదని చెప్పఁబడు శతకంధర రామాయణ మెచ్చటను లభింపకున్నను నందులోనిదని యొకపూర్వకవి ఉదహరించిన పద్యమిది—

ఉ. వారక వారకామినుల వర్తులచారుకుచోపగూహముల్
కోరక కోరకోల్లసితకుంజములన్ జిగురాకుపానుపుల్
చేరక బారుకేరళ కళింగకులింద నరేంద్రమందిర
ద్వారవిహారులై సిరులనందక నందకపాణికొల్వరే ?

---

## 24. నారాయణభట్టు.

మహాభారత రచనమున నన్నయభట్టారకునకు విశేషముగఁ దోడ్పడిన నారాయణభట్టు భీమకవి దగ్గఱ ఆంధ్రమున కవిత్వము

చెప్పుట నభ్యసించెను. నారాయణభట్టు సంస్కృతాంధ్ర కర్ణాటభాష లం దసమానపాండిత్యము గలిగియుండెను. భీమకవియెడ నాతఁడు గురుభక్తియుక్తుఁడై విధేయుఁడై మెలంగుచుండెను. నారాయణభట్టును, నన్నయభట్టును సహాధ్యాయులైనట్లు యీక్రింది పద్యమువలన గ్రహింపనగును—

ఉ పాయక పాకశాసనుని భారతఘోరరణంబునందు నా
రాయణభట్టు తానును ధరామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుర్ దివకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునై సవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపగన్.

తిట్టుకవిత్వము పేరుచెప్పినయెడల నందులకుం దగినవారిలో నగ్రగణ్యుఁడని భీమకవినే పేర్కొనవలయును. చంద్రరేఖావిలాప రచయితయై, యఖండయశః స్సముపార్జన మొనరించిన కూచిమంచి జగ్గకవి తన గ్రంథమున నిట్లువ్రేఖించి యున్నాఁడు

'క. భీమకవి రామలింగని
స్త్రీమన్మథుఁడై చెలఁగు శ్రీనాథకవిన్
రామకవి ముఖులను గ్రో
ధామగతిఁ జిత్తవీధిఁదలచి కడంకన్.'

## 25. పావులూరి మల్లన.

భీమకవికి పావులూరి మల్లన సమకాలికుఁడు. ఈతఁడు తెనుగున గణితశాస్త్రము రచించిన కవిశిఖామణి. నియోగిబ్రాహ్మణుఁ డాపస్తంబసూత్రుఁడు తన గ్రంథారంభమున నిట్లు వ్రాసికొనియున్నాఁడు.

'క. ఇలఁగమ్మ నాఁటిలోపల
విలసిల్లిన పావులూరి విభుఁడను సూత్రా

కలితాపస్తంబ ద్విజ
కులతిలకుఁడ వినుతగార్గ్యగోత్రోద్భవుఁడన్.

రాజనరేంద్రుఁడీ కవివతంసునకు పీఠికాపుర సమీపముననున్న నవఖండవాడ నిచ్చి బహూకరించినట్లీ క్రింది పద్యములు దెలుపుచున్నవి.

ఉ. శ్రీనిలయుండు శివ్వనను జిమ్మననున్మతి సూర్యదేవునిన్
ధీనిధిఁ బోలమార్యునిని దేజమునన్ రవితుల్యులైన యా
సూనుల నల్వురంబడసె భూరిజనస్తుత సత్యభారతీ
స్థానులఁ బద్మగర్భువదనంబులు నాలుగుఁ బోలువారిలోన్.

ఉ. శ్రీలలనేశుఁ డాంధ్రనృపశేఖరుఁడై చనురాజరాజభూ
పాలకుచేతఁ బీఠపురిపార్శ్వమునన్ నవఖండవాడయుఁ
బ్రోలు విభూతిఁబొందఁబడసి భూరిజనస్తుతుఁడైన సత్కళా
శీలుఁడు రాజపూజితుఁడు శివ్వనపుత్రుఁడ మల్లనాఖ్యుఁడున్.

ఈతఁడు రచించిన గణితము పావులూరి గణితమని ప్రసిద్ధి చెందియున్నది. ఆ గణితమున మొదట నీపద్యములు కాననగును.

శ్లో. శ్రీకంఠం సగుణం సమస్తజగతాం కర్తార మీశం గురుమ్
భూతోయానల చంద్రసూర్య పవనవ్యోమాత్మమూర్తిం విభుమ్
నిత్యానంద మయోపయోగిరిజ యాసార్థం ప్రజావర్ధయే
మాయా యోగమపైతితం శివకరం వందేశివం శ్రేయసే.

శా. అర్కాది గ్రహపంచక గ్రహణకాలాన్వేషణోపాయమున్
దర్క వ్యాకరణాగమాది బహుశాస్త్రప్రోక్త నానార్థనం
పర్కాదివ్యవహారమున్ భువనరూపద్వీప విస్తారముం
దర్కింపన్ గణితప్రవృత్తి వెలిగాఁ దార్కొండెటింగించునే?

శైలిని చూడుఁడు !—

చ॥ చెలికిపడంశమర్కు బ్రియకు శేషములోపలఁ బంచమాంసమున్
బొలుపుగ దాని శేషమున బోదకు నాలవపాలునిచ్చి యం
దులఁ దనపాలుఁదాగొనియెఁ దొమ్మిదిజేనలు రాజహంసమీ
నలిసమృణాళ మెంతసుజనస్తుత మాకెఱుఁగంగఁ జెప్పుమా.

పావులూరి మల్లనపై భీమకవి యీపద్యము వ్రాసెనని యొక
గ్రంథమున నుదాహరింపఁ బడినది

" సీ. అందోళికమునం దతిరహస్యంబుగాఁ
జాపరాయినిఁబెట్టి జాటినావు
జలనిధిలోతు లెక్కలచేతఁ గన్గొని
యద్దరిద్దఱియొడ్డ కరగినావు
మూసినబండిలో మునిగియుండెనని తెల్పి
తేనికిఁ గోపంబుఁజేచినావు
గాలిచే నల్లాడు కాగఁడాచుట్టలో
గద్యాణముల మూటఁ గాంచినావు
గీ. గణితశాస్త్రంబు రచియింపఁగల్గినావు
బతిసి మెప్పించి గ్రామముల్వడసినావు
తలఁప నీసాటి మంత్రులిద్ధరను గలరె?
మహితగుణవార శివ్వనమల్లధీర ! "

---

# 26. రాయనభాస్కరమంత్రి.

రాయనభాస్కరమంత్రి నామాంకితులైనవారు పెక్కురున్నట్లు
చరిత్రలు తెలుపుచున్నవి. రాయనమంత్రి పుత్రుఁడగు భాస్కరుఁడు
సాహిణిమారునకు భాస్కరరామాయణము రచించి కృతినొసంగెను.

మన వేములవాడ భీమకవి కాలమునాఁటి రాయనమంత్రి భాస్కరుఁడు తిక్కనసోమయాజికిఁ బితామహుఁడు. తిక్కనసోమయాజి తండ్రి కొమ్మనామాత్యుఁడు. ఈరాయనభాస్కరుఁడు రాజేంద్ర చోళునకు దండనాథుఁడై శాశ్వతకీర్తి నంపాదించెను. భీమకవి యొక నాఁడు యీ రాయనమంత్రి భాస్కరునికడ కరిగి, తనకొక యశ్వము నిమ్మని యడిగెను. మంత్రి ఆలోచనాధీనుఁడై ప్రత్యుత్తర మిచ్చుట కాలసించుటచే నది యసునంగీకారముగా భావించి యీ పద్యముఁ జెప్పినాఁడు—

క. వగమాని యర్థికియ్యని
   మగముండకు మీసమేల మన్త్రిమూతిపయిన్
   దెగఁగొఱుగఁ డాయె మంగలి
   రగడంబునఁ గీర్తిఁదోచ రాయనిబాచా!'

భాస్కరమంత్రి యీపద్యమునాలకించి నవ్వి, భీమకవినిఁ దనయశ్వశాల కడకుఁ గొంపోయి యుత్తమాశ్వమునిచ్చి, 'భీమకవీంద్రా! నీకెన్ని గోవులు కావలయునో కోరుకొను' మనఁగా, నాతఁడు 'భాస్కరామాత్యా! ఒకటిరెం డావులు నాకుఁజాలు' నని పలికి యీపద్యముల వ్రాసెను—

' క. చేకొని రాయనిబాచఁడు
   కాకాలు గుణించు పిన్నకాలమునాఁడే
   లాకేత్వ మియ్యఁజాలఁడు
   దాకను గొమ్మియ్యడిట్టి ధన్యులుగలరే? '

' ఉ. ఒకఁడు మాంసమిచ్చె మఱియొకఁడు చర్మముఁగోసియిచ్చెవే
   ఱొక్కఁడు నస్థినిచ్చె నిఁకనొకఁడు ప్రాణములిచ్చె వీరిలో
   నొక్కొక పట్టునన్ బ్రమకనోపకయిచ్చిరొ కీర్తికివచ్చిరో
   చక్కఁగజూడు మంత్రికులసంభవ ! రాయనమంత్రిభాస్కరా ! '

ఈభాస్కరమంత్రి తనూభవుఁడు కొండనామాత్యుఁడు. కొండనామాత్యుఁడుకూడ భీమకవి నాదరించి, గౌరవించెను. భీమకవి కొండనమంత్రిపై నీపద్యములఁ జెప్పెనని చాలమంది కవులు చరిత్రకారులు వ్రాయుటచే వాని నిటనుదహరించు చున్నారము—

శా. కాండాగ్ర్యర్భన భాండభూపతివృథక్రీడేయ క్రీడేయసూ
కాండాటాధిపకేతు పాతాంశులాకాశ్రవంతీ మగు
త్కాండ ఖండలతుండ పాండురయశః కర్పూరపటభవ
త్కాండా, రాయన మంత్రిభాస్కరునికొండా, దండనాథాగ్రణీ!

శా. రెండానాల్కలు నాఁపుదాఁడ ననిన్ లెక్కింపఁగానొక్కఁటే
గండా గొండిశిఖండి బనపకీలెక్కల్గొ నాల్కల్ కదా
వ డారాతి కిలాటకి నహాండేజస్వరి ధాటీలన
త్కాండా, రాయనిమంత్రి భాస్కరునికొండా, దండనాథాగ్రణీ!

ఆ. వె. పడుచునిడినవాఁ బద్యమిచ్చినవానిఁ
గడుపు కిడినవాని నడుపవలయు
నడువలేనివాని నయవిదులెంతురా
భువిని భాస్కరేంద్రపుత్ర! కొండ! '

---

## 27. బీదమార్యుఁడు.

రాజమహేంద్రవరమును రాజరాజనరేంద్రుఁడు పరిపాలించు చుండగాఁ బీదమార్యులకు ద్రాక్షారామ సమీపముననున్న కోరుమిల్లి యను గ్రామమును శాసనపూర్వకముగా నొసంగెను. వేములవాడ భీమకవి దాక్షారామమున నుండునప్పుడు తఱచుగా బీదమార్యునికడ

కేగుచుండెను. భీమకవియుఁ బీదమార్యుఁడును గలిసి యొకనాఁటి యుదయమున స్నానార్థమై గోదావరి కరిగిరి. అది వేసవికాలము సముద్రపుఁ బోటుతగిలి గోదావరి నీ రుప్పగానుండెను. భీమకవి యది తెలియనివాఁడై, యాచమనముఁ జేసెను. నీరుప్పగానున్నందున వెగటు తోఁచెను. బీదమార్యు డదికాంచి 'కవీంద్రా! ఏమట్లు వెగటుగొంది నట్లు కాన్పించుచున్నా' వని ప్రశ్నింపఁగా నాతఁడు జరిగినది చెప్పెను. అంత నాతఁడు 'కవిచంద్రమా! సముద్రపుఁబోటు తగిలి నీరుప్పనైనది. అంతమాత్రమున సందియమొందనేల? నీవేమన్నది జరుగదు?' అనియెను. భీమకవి యాతట నీపద్యముఁ జదివెను—

'చ. సుమహితవార్ధి కౌఁగిటను జుట్టినినుక్ రహింపనాతనిన్
గమనధృతిక్ బెనంగిమెయి గ్రక్కకవచ్చితివీవు గౌతమీ
రమణిరో! పీడు సాగరుని రమ్యతరంబుగ బీదమార్యుఁడా
చమనముఁ జేయఁబోవునిఁక సాగవుమాయెమటన్ వినోదముల్.'

ఇట్లనినంతనే నాజలముయొక్క యుప్పఁదఁముబోయి మంచి రుచిగలదయ్యెను. స్నానానంతరము బీదమార్యుఁడు భీమకవినిఁజూచి 'కవీంద్రా! వేసవికాలమునందైన యీసా రుప్పఁదనము చెందకుండు నట్లు చేయు' మనియెను. భీమకవి యట్లేయని యీ క్రిందిపద్యముం జెప్పెను—

'ఉ. ఎప్పుడునిన్ను భీమకవి యిట్టులొనర్చెనో? నాఁటనుండి నీ
యుప్పఁదనంబు మాని యిటనొప్పుగఁ దియ్యఁదనంబునొందుమా
యొప్పులకుప్ప గౌతమి! మహోజ్జ్వలభక్తుఁడు బీదమార్యుఁడున్
దప్పకనిన్ను నెల్లపుడు దద్దయుభక్తినిఁ బూజజేసెడున్.'

నేఁటికిని కోరుమిల్లిదగ్గర నీరు ఏకాలమునందును నుప్పగా నుండదు.

# 28. నృసింహపురాణము.

భీమకవి వత్సవాయ తెలుంగురాయలకు నృసింహపురాణమును రచించి, కృతి యిచ్చెనని చెప్పుదురు. నృసింహపురాణమును భీమకవి రచించు సందర్భమును మాత్రము పెద్దకథగాఁ జెప్పుదురు.

వత్సవాయ తెలుంగురాయలకు వేఁటయం దధికమగు ప్రీతి. ఆతఁడొకనాఁడు సాయుధులగు నాశ్వికులను బదాతులను గొందఱిని వెంటనిడుకొని మృగయావినోదార్థమై యరణ్యమునకుఁ బోవుచు, భీమకవిని వెంటనిడుకొని వెళ్లెను. వారు వనముచేరుసరికి భానుఁ డస్తాద్రికేగెను. 'కలవరముఁజేయక వనములో నాలుగు వంకలకుఁ బోయి కలఁతనొందించి మృగములఁ జంపుఁ' డని తెలుంగురాయలు తన పరివారమున కానతిచ్చి, తానును భీమకవియు నొకదిక్కుగా నా వనాభ్యంతరమునకుఁ బోయిరి.

భీమకవి 'రాజేంద్రా! ఘోరకసూకరహర్యక్ష కరాళవ్యాళాది భయంకరమృగ సంకీర్ణమైన యీవనమునఁ బ్రవేశించితిమి. ఏ క్రూర మృగము మనలనెదుర్కొనునో' యనెను. అంతలో నొకవరాహము వారి కెదురుగా వచ్చెను. తెలుంగురాయ లేమిచేయుదునా యని యోచింపుచుండెను. 'ఏమిరాజా! ఆలోచింతువు? శరపరంపరచే నాసూకరమును వధింపుము. త్వరపడుము. లేకున్న ఆజ్ఞయిమ్ము. నేనే యావని చేయుదును' అనియెను.

'ఏమి బ్రాహ్మణుఁడా! నీవు రణతిక్కనవలె శౌర్యప్రతాప సమన్వితుఁడవైనట్లు తోఁచుచున్నది. వేఁటలోఁగూడ నీ కభిరుచి యున్నదా!' యని తెలుంగురాయఁడు ఆశ్చర్యముగాఁ బలుక, భీమకవి 'రాజవంశసమా! నాకిం ఖడ్గ మనవసరము. ఒక పద్యము చాలు నా వరాహ మొక్కయడుగైన కదలకుండ జేయుటకు, నేనట్లు

చేసిన వదవ నీవు శరజాలముచే దానిం బంధింపవలయును ' అని వచించి, యీ పద్యముం జెప్పెనట—

' చ. కడకు ధనంజయుండు మునుఖాండవమున్ దహియించువేళనే
ర్పడ శరజాలబద్ధమయి వర్షముల్ భుజాలనట్టులే
యడవిని సందుగానకిట నాగువరాహము ! నాదువాక్యనన్
బొడువదు ప్రొద్దుకూడ నినుభూపతి కర్పణసేతు నిమ్నోడన్. '

ఆ వరాహ మొక్కయడుగైన ముందునకువేయక ఆగిపోయెను. తెలుంగురాయలు నిశ్చేష్టుండయెను. ' రాజా ! ఇంక నీ ప్రతాపముం జూవు ' మని భీమకవి వచించి, తనవాక్యంధము నడలించునరి కా వరాహము మూర్ఛిల్లవించిన రౌద్రిమోయని రాయలపైం బడంబోయెను. నేర్పుమై దాని విసరును తప్పించుకొని తెలుంగురాయలు నిశితశరజాలముచే నా పందిని బంధించి, తన చాకచక్యముం బ్రిదర్శించునరికి భీమకవియు నాశ్చర్యమగ్నుం డాయెను. భీమకవి ' రాజేంద్రా ! మన కిరువురకును గూడ సమానమగు శక్తిబలము లున్నవి. మృగయావినోదముకూడ పాతక హేతువే యగును. కావున నాసూకరమును జంపక విడచిపుచ్చుము. ఇంక నింటికి మరలుదము. ' అని పలికి, పరివార సమేతముగ నింటికింబోయెను.

పిమ్మట నా వేటకేగి వరాహమును జంపంబోయిన పాపము పరిహార మగుటకై భీమకవి వరాహపురాణము లేక నృసింహపురాణములో నొకచోట—

' చ. సురుచిర పానపాత్రమును సుందరియొక్కతె కేలనిందుచం
దురుండు ప్రకంపితాంగములతోం దిలకించెం దదాననాంబుజ

స్ఫురిత విశాలవైభవము సొంపలరంగురవ్రముచ్చిలింపఁ జె
చ్చెరఁ జనుదెంచి కట్టువడి చేష్టడి భీతివడంక చాడ్పునన్. '

అని చదువఁగా తెలుంగురాయలు నిర్భరానందవివశుండై బహుళసత్కార మొనరించెనట!

నృసింహపురాణములోని కొన్నిపద్యములు:—

' చ. కలనఁగాంచె నభశ్చరులు కంపముఁ జెందకుఁడెల్ల కిన్నరుల్
తలఁగకుఁ డచ్చరల్ మునులుఁ దత్తరమందకుఁ డేనువచ్చి మీ
యలజడులెల్లఁ బాసి మిమునందఱఁ గాచెదనంతవట్టు మీ
గలిగిన వారియుండుఁ డసికైటభమర్దనుఁ డెల్లభంగులన్.

చ. శ్రుతిమతధర్మమార్గములు శోధ్యపుమూల్యము లప్పురంబునన్
జతురతఁ బుణ్యవస్తువులు సారవిముక్తి పదంబులమ్మ వా
రతులిత విష్ణుశాసన సమాహితులైన మహాత్ములంచితో
ద్ధతిఁ గొనువారు మీసువిహితవ్రత పారగులైన బోధనుల్.

గీ. పొదవి యుండెడి దివియును భువియు దెసలు
గాదివికసించియుండు చీఁకటిప్రోవువలన
మిక్కుటంబుగఁ గాయక గ్రుక్కినట్లు
కరవటంబున దగిదండ ఖడ్గమమున.

క. అదియట్లు కాదు చెప్పినఁ
జెదలంగునె దేవదేవు శ్రీరమణేశున్
మదినుంచుకొన్నవానిని
బొదవునె యాపదలు? దవిలిఁ బొందునె తమముల్.

ఉ. శ్రీస్తనకుంకుమద్రవ నిషిక్త భుజాంతరభాగ విస్ఫుర
త్కౌస్తుభ నూతనార్కరుచి గర్వితనాభిసరోజసారథ

ప్రసూత మత్తభృంగవర రాగరసోల్బణభోగిభోగ త
ల్పాస్తరణుం దలంచుసుకృతాత్ముల పాప సమస్త కల్మషుల్.

చ. కడిదివరంబు వారిరుహగర్భునిచేఁ గొనినాఁడు వాఁడుమీ
యెడననిశంబుఁ జెప్పఁగయు నీసుమదిచేమను నెమ్మనంబులోఁ
జడిగొని యుండుగావున నసాధ్యుఁడవధ్యుఁడు దైత్యనాథుఁడే
వడువునఁ బౌరుషంబుగొని వానిజయించుట ప్రేరుఁజూడగన్.

గీ. పొగడ ప్రమాకలమొదలను బుష్పరసము
తెరగి నెత్తావియాదున నెరయనొప్పఁ
జూచుకొలఁకును మున్ను నింపులుదలిర్పఁ
గడఁగి వనలక్ష్మి యుమిసినగళ్ళియనఁగ.

మ. ధరణీమండలి దిక్కరందిరిగఁ జాతాళంబు [illegible]
[illegible]వనాథ ప్రముఖాఖిలామర నివాస[illegible]
నెరయున [illegible] సంధ వాలయము [illegible] ని [illegible]నెవ్వేళ శ్రీ
కర[illegible]తేయు[illegible] భవో[illegible] [illegible] ము[illegible].

క. మీఁజేన మూనుల కీచుకను
మాటలుగికయున్న మీసముగ్రమ వే
మాటుఁ గొనియాడఁగాఁ దగు
గీటునె న్వాప్నపలబుద్దిఁ గల్గిబుధయముల్.'

---

# 29. కులోత్తుంగ చోడదేవుఁడు.

రాజరాజ చోడుని కుమార్తెను పరిణయమైన విమలాదిత్యుని కుద్భవించిన కుమారునిపేరు రాజరాజనరేంద్రుఁడు. ఈతఁడు తన మేనమామయగు రాజేంద్రచోడుని కుమార్తె అమ్మంగదేవునిఁ బెండ్లి

చేసికొనెను. ఈదంపతులకు జన్మించిన మగశిశువునకునకు రాజేంద్రచోడు
డనియే నామకరణము చేయబడెను. ఈ రాజేంద్ర చోడుఁడే చోళరా
జ్యాధిపతియైనపిమ్మట కులోత్తుంగ చోడదేవుడని పిలువఁ బడసాగెను.

భీమకవి ప్రశస్తి నాకర్ణించి యున్నవాఁ డగుటచేఁ గులోత్తుంగ
చోడదేవుఁడు పిలిపించి, సత్కరించెను. ఆతఁ డేయుద్ధముగ కేగినను
భీమకవినిఁ దనతో దీసికొనిపోవుచుండెను. అందుల కనుగుణ్యముగా
కులోత్తుంగ చోడదేవున కెన్నఁడును బరాజయ మనునదియే కలుగకుం
డెను. ఈతని శత్రువులెల్లయును భీమకవినిఁ దమవంకకు ద్రిప్పుకొని,
విజయమునంద నభిలషించుచుండిరి. ఒకప్పుఁ డొకశత్రురాజు వచ్చి,
భీమకవి యొక్కడికో పోవుచుండఁగాఁ బిలిచి 'ఆర్యా, మారాజ్య
మున కొకసారి దయచేసి, మాసత్కారములంది పోరాదా' యనఁగా,
నాకవి యందుల కంగీకరించి యారాజేంద్రునితోఁ గూడ నరిగెనట.
కులోత్తుంగ చోడదేవుఁ డీయుదంతమంతయు నెఱిగి, ప్రచండ సైన్య
సమేతుఁడై యారాజునితో సంగర మొనర్పబోయెనట. కొన్ని
దినములు గడచినపిదప వేములవాడ భీమకవి తనకొఱకే యీమహా
సంగ్రామము జరుగుచుండెనని యెఱింగి, యారాజునకు కులోత్తుంగ
చోడదేవునకును రాజీచేసి, తాను కులోత్తుంగ చోడుని రాజధానికిఁ
బోయెనట.

---

## 30 గొల్లభామ.

వత్సవాయ తెలుంగురాయఁడు పెద్దాపురాధీశుఁడై యున్న
పుడు భీమకవి తఱచుగా నతనిదర్శనార్థ మరుగుచుండెడి వాడని చెప్పి
యుంటిమి. ఆ యూర నొకసుందరాంగి 'మజ్జిగోయమ్మ మజ్జిగ'
అనుచు, శిరస్సుపైనుండు ఘటములోని చల్లయంతయుఁ గ్రింద చిందు

నట్లతియొయ్యారముగ నడచుచు విక్రయించుచుండెనట. యౌవనోద్భాసితులగు యువకులు చల్ల యవసరములేకున్నను ఆకాంతతో సరససల్లాపములాడు నెపంబునఁ జల్లఁ గొనుచుండిరట. ఒకనాఁడు తెలుంగు రాయలును భీమకవియు సౌధము పైయంతస్తున నిలువఁబడి వీధివైపు చూచుచుండఁగా నావిలాసిని యటునిటు త్రిప్పుకొనుచుఁ బోవుచుండెను. తెలుంగురాయ లామెను భీమకవికిఁ జూపి, "కవివరేణ్యా! ఆమెకంత నిర్లక్ష్యభావ మేమి? ఆమె యెవ్వరు?" అని యడుగ భీమకవి "రాజచంద్రమా! ఆమె విలాసిని అని ఆమె వేషమే చెప్పుచున్నది. ఆమె దుశ్చరిత" అనెను. "నీ కెట్లు తెలియు?" నని రాయలు ప్రశ్నింప నాతఁడు "రవిగాననిచో కవిగాంచునే కదా! ఆమె యుదంతముఁ జెప్పెద నాలకింపు" మని యీక్రింది పద్యమును జెప్పెనట.

"ఉ. భూపతిఁ జంపితిన్ మగఁడు భూరిభుజంగము చేతఁ జావఁగా
నాపద నొందినొంది యుదయార్కుని పట్నముఁ జేరి వేశ్యనై
పాపముఁ గట్టుకొంటి సుతుఁ బట్టిభోజుంగని జెట్టవట్టిసం
తాపముఁ జెంది యగ్నిఁబడ దగ్ధముగాకిటు గొల్లభామనై
యీవని కోర్చుకొంటి నృపతీ! వగ సేటికిఁ జల్లచిందినన్."

తెలుంగురాయఁ డాశ్చర్యపరవశుఁడై యానారీమణిని బిలిపించి "నీచరిత్ర దెలుపు" మన నామె యిట్లు చెప్పఁదొడఁగెనట.

"ఆర్యా! నేనొక విప్రునిభార్యను. నేను వానముచేయు పురాధిపతి నన్నుఁ జూచి విమోహితుఁడై నాతోఁ జెలిమిచేసెను. నాపతికి నాదుష్ప్రవర్తనముఁ దెలిసి, నన్ను మిక్కిలిగా నిందించుచుండెను. నాపతి కెట్లయిన విషమిడి చంపినచో రాజుతో నిర్విచారముగా, నిరథ్యంతరముగాఁ గాలము గడపవచ్చునని యాశించి ఫలహారమున విషముకలిపి నొకపళ్లెరమున నుంచితిని. ఆరాజకుమారుఁడు వచ్చి,

నేను చూడకుండ నాఫలాహారములఁ దానుభుజించి, విగతజీవుఁ డయ్యెను. నాపతియొక గ్రామాంతరమునుండి వచ్చుచు సర్పదష్టుఁడై ప్రాణములఁ బాసెను. కుమారుఁ డింటినుండి వెడలనడిచెను. తిండికిలేక, వేశ్యావృత్తి నవలంబించి, అనలమున నుఱికియు, నగ్నిహోత్రుఁడు కూడ నన్ను తాకవెఱచుటచే బ్రతికి యిచ్చట నీరీతిగా చల్ల నమ్ము కొనుచు "వనము జేయుచున్నా" నని చెప్పి, తెలుంగురాయల వలనఁ గొంతధనము తీసికొని వెడలిపోయెను.

---

## 31 భీమకవి చాటుపద్యములు

ఉ. నవ్యవిలాసరమ్య నలినంబపి బాలసుధాబ్ధిసారభా
భివ్యసనంబునం బరగుభృంగకులోత్తమ తద్వియోగతా
పవ్యధ బ్రాణిపిల్వనుకృపాగుణమేర్పడ బ్రాహ్మణోనహం
తవ్యయనంగ నొప్పువచనస్థితి నిండవెలుగఁ జేయుమా.

చ. బిసరుహగర్భువ్రాతయును విష్ణుని చక్రము వజ్రివజ్రముం
బెసలను రామబాణము యుధిష్ఠిరు కోపము శూలిశాపమున్
మసకవుఁ బాముకాటును గుమారునిశక్తియుఁ గాలుదండమున్
బశుపతి కంటిమంటలును బండితవాక్యము రిత్తవోవునే?

ఉ. మానుగ విశ్రమాక్షర సమంచితమై స్వరమూఁదిసం దదీ
యానుగుణాక్షరంబు గొసగ్రమైనను జెప్పఁగనొప్ప నీకృతియన్
భానుసహస్రభాసి వృషభాధిపుడిష్టులనర్థియుక్తమై
పూనినచో నఖండవశిపొల్పగు నాదికవి ప్రణీతమై.

ఉ. వారక వారకామినులకర్థుల నారు కకోపగూహముల్
కోరక కోరకోల్లసిత కుంజములం జిగురాకు పానుపుల్

## 32. మహిమ.

వేములవాడ భీమకవి యొకనాఁడు కొందఱు బ్రాహ్మణులతో దేవాలయమంటపమున గూర్చుండియుండఁగా నొకఁ డీవేళ తిథియేమని యడిగెను భీమకవి 'అమావాస్య' యనెను. బ్రాహ్మణు లందఱును నవ్వి 'చాలగొప్పవాఁడవే ? నేఁ డమావాస్యయా ?' అనెను. ఆనాఁడు పౌర్ణమయె యుండెను. కాని తనపంత మోడిపోవుట కంగీకరింపనివాఁ డగుటచే 'మీరానేనా తెలివితక్కువవాఁడను ? చూడుఁడు మీరనినట్లు నేఁడు పౌర్ణమకాదు. అమావాస్యయే' అని చెప్పెను. 'అటులయిన సాయంకాలమువఱకు నిచ్చటనే యుందము. చంద్రుఁ డుదయింపఁడు. చీఁకటియె జగత్తు నలముకొను' నని వచించి, ద్రాక్షారామ భీమేశ్వరుని ప్రార్థించెను. సందెగంటలయ్యెను. ప్రపంచమంతయు భీమకవి చెప్పిన ట్లప్పుడు గాఢతిమిరావృతమయ్యెను. ఎల్లరు నాశ్చర్యవివశులై, భీమకవినెంతయుఁ గొనియాడి 'కవివరేణ్యా ! నీమహిమ యసాధారణమైనది. ఇఁక యథాప్రకారముగా వెన్నెలఁ దెప్పించు' మనిరి. భీమకవి మఱల భీమేశ్వరునిఁ దలఁచికొనెను. ప్రపంచమంతయు పిండి యారఁబోసినట్లు వెన్నెలచేనిండి, హృదయాహ్లాదకరముగ నుండెను. భీమకవి అన్నదియెమైనను తూచాతప్పకుండ జరుగుచుండెను. ఎల్లరు నాతని మహిమనుగాంచి, యద్భుతానంద సంభ్రమాశ్చర్య నిమగ్నమానసు లగుచుండిరి.

---

## 33. కళింగాధిపతి.

వేములవాడ భీమకవి యొకానొకప్పుడు కళింగాధిపతి యగు రాజేంద్రచోడుని కడకు దర్శనార్థియై యరిగెను. ద్వారపాలకుఁడు భీమకవి యెంత చెప్పినను లోనికిఁ బోనీయకుండయ్యెను. భీమకవి కోపో

ద్రిక్తుఁడై 'నన్ను లోనికి వెళ్ళనిచ్చెదవా లేదా' యనెను. 'స్వామీ! ఆగ్రహింపకుఁడు. మహారాజుగారు అవసరరాజకార్యనిమగ్నులై యుండుటవలనను శత్రురాజులపై దండెత్తదలంచి యుండుటవలనను నిన్ను నెవరితోడను సంభాషించుట కంగీకరింపరు. దయయుంచి, నన్నిబ్బంది పెట్టకుఁడు' అనెను

'ఓరీ వెఱ్ఱివాఁడా! మీరాజు రాజకార్యాలోచనాపరతంత్రుఁడై యున్నను నన్ను నిరోధింపఁజాలఁడు. వెళ్ళనిమ్ము' అని చెప్పినను, ఆ పరిచారకుఁడు వినకుండుటను భీమకవి కుపితుఁడై 'కుచ్ఛితుఁడా! నామహిమ యెఱుంగక నిరోధించితివి. నీశరీర మాపాదమస్తకము మంటలు బయలుదేరుఁగాక' యని శపించుసరికె, ఆ పరిచారకుని యొడలంతయుఁ గాల్చినట్లు మంటలారంభమయ్యెను. భీమకవి వెడలిపోయెను. ఆ పరిచారకుఁడు అమ్మో మొఱ్ఱోయని భూమ్యాకాశములు ప్రతిధ్వనించునట్లు విలపించుచు, భీమకవి పోయినదిక్కుగా బయలుదేరి, వెదకి వెదకి వేసారి విఫలుఁడై తిరిగి యంతఃపురము కడకు వచ్చి రాజుతోఁజెప్పెను. 'అయ్యో! ఎంతపని జరిగినది? ఆ మహానుభావునియెడ నేల యపచార మొనరించితివి?' అని మందలించి, చారులను నలుదిక్కులకంపెను. భీమకవి ఆయూరనే యొక బ్రాహ్మణునియింట బసచేసియున్నటులఁ దెలిసికొని రాజేంద్రుఁడు కబురంపి, రావించి, 'హే మహాత్మా! పరిచారకుని యపరాధము క్షమించి, యతిదీనముగ విలపించుచుఁ బ్రాణమాత్రావశిష్టుఁడై పడియున్న వానిని రక్షింపవే' యని వేఁడుకొనఁగా, భీమకవి దయార్ద్రహృదయుఁడై శాపము నుపసంహరించెను. పరిచారకుండు బాధానివృత్తి నొంది, భీమకవి పాదములపైఁబడి క్షమార్పణగోరెను.

రాజేంద్రుఁడు భీమకవి నుచితరీతిని సత్కరించి, 'మహాత్మా! ఈ సౌధమునకెదుట నీకొబ్బరిచెట్టు అడ్డముగనున్నది. తావకమహత్త్వ

ముచే నిది దారినుండి తొలఁగునట్లు చేయవే' యని యడుగ నాతడు 'సరే.' యని యొకపద్యముఁ జదువుసరికా కొబ్బరిచెట్టు దూరముగా నుండెను. ఎల్లరు నిమహిమ నాలోకించి, విస్మయపరీతచేతస్కులైరి.

---

## 34 ఇతర పద్యములు

' ఉ. అంతదిగంత దంతురిలతాంత నితాంత సితాంతకాంతవ
స్వంతిక తాంతసాంధ్రజనతా తరసంతతకృంతనప్రథా
త్యంత సుమంతవిస్ఫుర దుదంతపకాంతి సంతతి
ప్రాంత దురంతకాంతరతి కాంతిమునొల్చె వసంతమెంతయున్.

చ. ధరణితలేంద్రనందన విధంబుగనుండగనగోరి మున్ను కి
న్నరవరుఁ డిచ్చినట్టి ఘనవస్తుతమైన యదృశ్యవిద్య న
య్యరువురు గుప్తమూర్తులయి యిందు సహోదరిమందిరంబునన్
దరలకయుండి రొట్టెయెడఁ దప్పియుఁజేరగవచ్చి యచ్చటన్.

---

### — అప్రక్షిప్తములు —

' సీ. ఆరయఁ బరదేశి నాంధ్ర సయిటయుండు
తనసంపదానే పందుకొనుట రెండు
విలసతి నొసఁగొసి, తొలఁగిపోవుట మూఁడు
నలయుఁగ యాచకవృత్తి నాల్గు
తన సరివారిఁబెంచను జేరుకొన్నదైదు
గురు చేరుంగని రాజ గొల్చుటారు
చదువు నేరకయుండి సభకుఁబోవుల యేఁడు
నెన్న దారిద్ర్యంబు నెనిమిదవది

గీ. అష్టకష్టంబు లనియెడు నవ్వియిప్వ
గాన యిటువంటి వెవ్వరికైన వలదు
చారుతరమూర్తి; దేవతాచక్రవర్తి
రమ్యగుణధామ, కావేటిరంగధామ.

క. ఆడినమాటలు వప్పిన
గాడిద కొడుకంచు దిట్టగా వినియయ్యా,
వీఁడా నాకొక కొడుకని
గాడిద యేడ్చెంగదన్న ఘనసంపన్నా!

క. అసమాన వానవిద్యా
రసికతలేనట్టి నరుని బ్రతుకేటికి సీ
కసవేఱుక తిని బ్రదుకదె
పసరము తనకడుపునిండ పసరముకొండా!

క. సమశీల శ్రుతియుతులకు
సమధనవంతులకు సమసుచారిత్రులకున్
దమలోన సఖ్యమువివా
దము దగుఁగాని మములకును దగునే యొరుల్.

క. కోటాన కోటులిచ్చిన
గూటికి సరిరాదు దేవకోటులురారా
పాటించి యడ్డవానికిఁ
గూటికి మారెళ్లకొండ! గుణరత్ననిధీ.

క. అని బాలున కిధనవ్వను
ధనసంపద నవ్వ నుచితదానవిధానున్
దనయుని ముద్దాడంగాఁ
బెనిమిటిఁగని జారనవ్వఁ బిచ్చయరేచా.

క. పదివేలమంది కిచ్చియుఁ
దుదకొక్కని కీయకున్న దొరకవుకీర్తుల్
పదివేలు నోమునోచిన
వదలదె యొకటంతువంక నన్నియునుంకా.

క, ఇప్పటి యన్నముకొఱకై
త్రిప్పలబడి కందనేల? దేవుఁడుశిలలోఁ
గప్పనొసంగెడు హారము
కప్పలుగ మహేంద్రవాస, గోకర్ణేశా.

క. చెప్పినపని యొనరించిన
యప్పణతుక గల్గుగహన మదిసదనముగున్
జెప్పినపని యొనరింపని
యప్పణుఁతుక గల్గు సదనమదిగహనముగున్.'

---

—:భాస్కరుఁడు:—

"సీ. ఏమంత్రి సత్కీర్తి హిమసేతుపర్యంత
మవనిమండలము ముత్యాలశాల
ఏ మంత్రి మొగసాల యేప్రొద్దుచూచిన
సంగీతసాహిత్య సరసగోష్ఠి
ఏ మంత్రియిలవేలు పందురేఖామాళి
చాడేశ్వరీ మహాశంభునకు
ఏ మంత్రి సౌందర్య మిందివరాక్షుల
వాలారుఁజూపుల వలపుముద్దు

గీ. అతఁడు హరిదాసవంశాబ్ధి కబ్జభవుఁడు
అర్థిదారిద్ర్యగాఢ తమోర్కుఁడతఁడు

దానధర్మ పరోపకారానుకూలి
భాస్కరుని రామలింగన్న భాస్కరుండు.'

'సీ. కడఁగిమేఘుం డేకకాలంబుననె కాని
కొమరొప్ప నేవేళఁ గురియఁగలఁడె
కలభూరుహ మొక్కకాలంబుననె గాని
గరిమ నేవేళలఁ గాయఁగలదె?
కమలారి తానొక్క కాలంబుననె కాని
యేవేళ నమృతంబు నీయఁగలఁడె
కామధేనువు నేకకాలంబుననె గాని
పేఁపొందనేవేళ బిదుకఁబడునె?

గీ. వలుచనై పోక యాకుల పాలులేక
వట్టిపోవక చిల్లరవంతలేక
యనుదినం బర్థులకొసంగెదౌర! భువిని
ఘనసుగుధసాంద్ర! రామలింగయ్య చంద్ర."

"మ. అయలక్ష్మీనిధి రాయన ప్రభుని బాచామాత్యుఁ డశ్రాంతమున్
నియతిఁ బ్రాహ్మణపూజసేయు టభివర్ణింపంగ శక్యంబెత
త్ప్రియ యగేహంబున హేమపంజరంబునన్ బెలర్చుత ప్రార్చుత
పిప్రియమేధాయనుచుం బఠించు శుకశారీ కిన్నరద్వంద్వముల్.

ఉ. ఏమిచిలింపశారికా? పనియేమిను రేశ్వర యీవినిన్నుఁ జిం
తామణి మీఁటినాఁడటకదా మనరాయన బాచకోవిద
గ్రామణి, యానయింతటనె కాచుచు మీవిభవంబునందుని
న్నేమతియందునీగురువునోనీగురువునోసుకుమారత నీకుమారునో.

ఉ. రాజితకీర్తిశాలియగు రాయనిబాచ! భవద్భృశంబు ది
క్పూజిత మౌచుమించె సురభూధర భూధర భూధరేంద్ర కాం

తాజనుగోత్ర దుగ్ధధురధాంగ రధాంగ రధాంగశేష భా
షాచల జాహ్నవీహిత తుషారతుషారి తుషారధామములన్.

సీ. ఫణిరాజు తనశిరోమణు లరికిచ్చునో
యనుచు విష్ణువు క్రిందనణఁగియుండె
శైలాసకు ధర మెక్కుడనిచ్చునో యని
యుగ్రుఁడక్కడ కావలుండెఁబూని
గొనయాదు మణులనే తఱిసిచ్చునో యని
వనధిన తతమును వహించుచుండె
సురధరాధరము నెవ్వరికిచ్చునో యని
తరణి యచ్చెరువందు దిరుగుచుండె

గీ. రాజ! నీదానవిఖ్యాతి యాఖండదిశల
మించి నవరించె నీకీర్తి నెంచఁదరమె
గాఢదారిద్ర్య యామినీహరణ చంద్ర
భాగ్యదేవేంద్ర! రాయన భాస్కరేంద్ర.

"సీ. నీపంక్తి నొకనాఁడు నెఱిభుజించిన విప్రుఁ
డమృతాన్నమును నరుచి సేయు
నీసభాస్థలి నొక్కనిమిసమున్న జనుండు
తల్పశేషుని సన్నఁ దప్పువట్టు
నీరూప మొకనాఁడు తేఱిచూచిన భామ
కందర్పునైనఁ దాఁ గాలఁదన్ను
నీచేతిదానమ్ము నెమ్మినమ్మిన యర్థి
మెచ్చఁడు ధనాధిపుఁ బొమ్మనొల్లు
గీ. నీవె నినుఁబోలుదువుగాక నిన్ను నెన్న
యున్న మంత్రులనెన్నుట పిన్నతనమె

బాలికాపాత్రిణ నూతనపంచబాణ
భాస్కరేందుని రాయని భాస్కరేంద్ర!

సీ. అతిథికోట్లకు నిలనమృతాన్న సత్రంబు
వంబలిసత్రంబు నాతురులకు
ఆచార్యులిండ్ల రామానుజసత్రంబు
నూనెసత్రము శిరసాస్నానమునకు
బాలకులకును నేర్పడఁ బాలసత్రము
కామసత్రము విటగ్రామణులకు
జలకమాడుట కింటజలసృష్టి సత్రంబు
తాంబూలసత్రంబు ధన్యులకును
గీ. కట్టడలుచేసి వినుకొండ పట్టణమున
సర్వకాలము సత్కారపూర్వకముగ
మంత్రిరాయన భాస్కరామాత్యుఁ బోల
గలరె? దాతలు మూఁడులోకములయందు.

సీ. నిత్య సత్యత్యాగనీతిలో శిబిఁజెప్ప
నినుఁజెప్పి మఱియును నిన్నుఁజెప్ప
బహుపరాక్రమునఁ బరశురాముని జెప్పి
నినుఁజెప్పి మఱియును నిన్నుఁజెప్పి
రఘుకులోత్తముఁడైన రామచంద్రునిఁజెప్పి
నినుఁజెప్పి మఱియును నిన్నుఁజెప్పి
సుకుమారుతను నరి సురరాజసుతుఁజెప్పి
నినుఁజెప్పి మఱియును నిన్నుఁజెప్పి
గీ. చెప్పఁదగుఁగాక యితరులఁ జెప్పఁదగునె
కలియుగంబున నీవంటి ఘనుఁడుకలఁడె

అమితగుణసాంద్ర ! మానినీ కుముదచంద్ర
భాగ్యదేవేంద్ర! రాయని భాస్కరేంద్ర.

ఉ. రాజిత కీర్తి శాలియగు రాయని భాస్కరువేఁడఁబోవఁగా
నాఁజికిసిట్లనున్ బరుసియాలికిసిట్లను సర్ఘికిట్లనున్
దేజము పెంపులేని యాతిడీనుని హీనునివేఁడఁబోవఁగా
నాఁజికిసిట్లనున్ బరుసియాలికిసిట్లను సర్ఘికిట్లనున్—"

వేములవాడ భీమకవి యిట్లు దిగంతవిశ్రాంత యశోవిరాజితుఁడై పరిమళించెను అతని పాంచభౌతికి కాయము ప్రపంచము వీడినను, కీర్తి ఆచంద్రతారార్కమై విలసిల్లుచున్నది.

---

# కొన్ని చాటువులు

## — పెమ్మయ సింగభూపతి —

ఉ. మచ్చికలేనిచోట ననుమానము వచ్చినచోట మొందుగాఁ
గుచ్చితులున్నచోట గుణకోవిదు లుండనిచోట విద్యకున్
మెచ్చనిచోట రాజు కరుణించనిచోట ప్రవేశులుండిరే
నచ్చట మౌనమాత్రము సుగుణాకర! పెమ్మయసింగధీమణీ.

ఉ. వాననలేని పువ్వు బుధవర్గము లేనిపురంబు నిత్యవి
శ్వాసము లేనిభార్య గుణవంతుఁడుగాని కుమారుఁడున్ సద
భ్యాసములేనివిద్య పరిహాసప్రసంగములేని వాక్యమున్
గ్రాసములేనికొల్వు కొఱగానివి పెమ్మయసింగధీమణీ!

ఉ. ఆడికకోడఁడేటి యుపకారము చేయుట తెరుఁగఁడేని ము
న్నాడినమాట తాఁ దిరుగనాడక యుండఁడ యేప్రల్లదం

బాడినయోగి సిగ్గువినయంబు నయంబును వీడె వేసినాఁ
డేడని యొగ్గుచుయ్యెడు మహీస్థలిఁ బెమ్మయ సింగభీమనీ!

ఉ. మాడలమీఁద నాసగము మాసిసి కొక్కడికీర్తి కీర్తిపై
వేడుకగల్లు నాతఁకి విత్తముమీఁద మహత్కృడాన యీ
రేడు జగంబులందు వెలహెచ్చిన కీర్తిధనంబు గాంచి న
త్రైష్ఠ మాశంబుఁజేసిపోసియు బమ్మయసింగఁడు దానకర్ణుఁడై.

ఉ. పెట్టుకకీర్తి రాదు వలపింపక యింతికి నీ పులేగు తాఁ
దిట్టక వాదులేదు కసుఫీరత వైరుల సంగరంబులోఁ
గొట్టకవాడలేదు కొడుకొక్కఁడు పుట్టకముక్తి రాదయా
పట్టపురాజుకైన పదిపద్ధతి పెమ్మయ సింగభీమనే.

## — చెఱువు —

వేములవాడ భీమకవి యొకప్పుడు ద్రాక్షారామమునుండి పదిమైళ్ళ దూరముననున్న యొక యూరునకుఁ బోవుచుండగా మధ్యనొక చెఱువు వడ్డమయ్యెను. ప్రక్కనుండి పోవుదమన మార్గమంతయు కంటకమయమై, బురదతో నిండియుండెను. చేయునదిలేక యాతఁడట్టె కొంతసేవు వేచియుండెను. ప్రొద్దెక్కుచుండెను. భీమకవి క్షుత్పీడితుఁడాయెను. ఆతఁడొకసారి దేవినిఁ దలఁచుకొని "నాకు మార్గ మేర్పడు గాక" యనునరికి చెఱువు పాయలై మార్గమిచ్చెను. గట్టుననున్నవారందఱును భీమకవి మహిమను గాంచి, యబ్బురమందిరి.

## — గువ్వల చెన్నని పద్యములు —

నీత్యుద్బోధకము లగుట నీపద్యముల నిట నుదాహరించుచున్నారము—

క. అడుగఁదగువారి నడుగక
బడుగుల నడుగంగలేమిఁ బాపంగలరా

వడగళ్ళఁ గట్టువడునా
గుడిరాళ్ళను గట్టకన్న గువ్వలచెన్నా.

క. సారాసారము లెఱుఁగని
పేరజమునకు బుద్ధిచెప్పఁ బెద్దలవశమా
నీరెత్తి పోసిపెంచిన
గూరేనా నేలవేము గువ్వలచెన్నా.

క. కలిమిగలవాఁడె మనుజుఁడు
విలసిత సత్కీర్తిచేత వెలయఁగవలదా
కలిమేమి యెల్లకాలము
కులగిరులా కదలకుండ గువ్వలచెన్నా !

క. కలిమిగల లోభికన్నను
విలసితముగఁ బేదమేలు వితరణియైనన్
జలిచెలమమేలు గాదా
కులనిధి యంభోధికన్న గువ్వలచెన్నా.

క. విలువరిస దానగుణములు
గలవారికిఁగాక లోభిగాడ్దెల కేలా
తలుపేల చాపగుడిసెకుఁ?
గులపావన కీర్తివన్న గువ్వలచెన్నా?

క. వెలివిద్య లెన్నియైనను
కులవిద్యకు సాటిరావు కుంభినిలోనన్
వెలకాంత లెందఱున్నను
గులకాంతకు సాటికారు గువ్వలచెన్నా.

క. తలలెంత పెంచుకున్నన్
గులధర్మము విడిచి కన్నకూళ్ళుం దిన్నన్

గలుగదు మోక్షము చిత్తము
విలయము గాకన్నబిజల వేముల చెన్నా

క. ఎన్నగల జీవరాసుల
నన్నిఁటిగర్భమునఁబుట్టి యాటనునుజం్గె
తన్నటిగి బ్రదుకవలెనా
కొన్నాళ్ళిక నెచటనున్న గువ్వల చెన్నా.

ఉ వారక యీశ్వరుండు తలపై ధరియించిన యంతమాత్రన
వ్వారిజవైరితో డ సరివత్తువె యుమ్మెతపూవ! నీపసః
వారిధులుబ్బునో దెసలు వన్నెలఁదేరునొ చంద్రికాంతముల్
నీరవునో చకోరముల నెవ్వగదీఱునొ తాపమూఱునో.

ఉ. పీనసరోగి నిన్నుఁదలపిట్టి సమానముచేసినంతనే
వాసి వివేకహీనతకువందుఁనేల కరంగనాథమా
మానవతీకపోల కుచమండలమండిత చిత్రపత్రికా
నూనవితాన వాసనల నొందుటలోకము నిన్నెఱుంగవే.

ఉ. ఎవ్వఁడవీవు? కాళ్ళుమొగి న...న వాంసమ ! నెందునుండువో
దవ్వల మాసికంబునను; దానవిశేషము లేమి తెల్పుమా
మవ్వపుఁగాంచ నాట్యములు మౌక్తికముల్ గలవందు; నత్తలో
యవ్వయెఱుంగ; మన్ననహహా! యనినవ్వేబకంబులన్నియున్.

మ. ధర నత్యుత్తమునై నవీరుని మనస్తాపంబువిర్వంగ స
త్పురుషానీకము మొపుఁగాని యొకయల్పుండో వనేత్రివదు
స్తరనై దాఘ నిదాఘతాపమడవన్ ధారాధరాచంద్రసా
త్కరధారావళిగాక యర్హమగునె గండూషతోయంబులున్.

ఉ. చేతికివచ్చుకార్య మెడసేసితివర్ధులు శత్రులైరి యిం
కేతరినైన కార్యముఘటించెదనన్న ఘటింపనీవు నీ
చేఁతగునట్టి చేష్టమును జేసితివింతియుకాక యింకనా
వ్రాఁతలోక యింతమార్పఁగలవా! గ్రహచారము! దుర్విచారమా.

ఉ. కాదనిపించుకోఁ దగదుకాని గుణంబునహించి లోభిచే
లేదనిపించుకోఁదగదు లేనిదురాశకుఁబోయి యిందురా
గాదనిపించుకోఁదగదు రట్టడియై కరినెక్కి దిక్కిదూ
పేదదియెంత? తుంపెరవునీహానమత ? నితాంతవైభవా.

చ. ఎనయుగహీనుడంట జలమింతయు సిల్వసిపాడుగుంట నీ
చునకుఁ బదార్థమంట తనుఁజూచి సహింపని యూరనుంట లే
దనియెడు చేనిపంట వెసనాఁకటికందసు వంటమంటకా
జనకసుతాభిరామ బుధసన్నుత! శ్రీపెనుమళ్ల రాఘవా.

చ. కరిగమనల్ గుణాత్ములనెకాని గమింపరు హీనజాతిగా
పురుషులఁగాని భూభుజులుప్రోవరు కానలఁగాని మేఘముల్
కురియవు సత్యశౌచములకుం బెడఁబాసినవానిఁ గానియిం
దిరవరియింప దుర్వ్యయవినీతులఁగాని ధరిత్రి పడెంతయున్.

చ. పిలువపకూటికిన్ వెతలఁబెట్టు ధరావరుఁ జేలు పీటికిన్
జలములు లేనియేఱికిని సారెకుబందువులున్న పోటికిన్
బలవురతోటి పాటికిన్నృపాలురసాటికిఁ బోవరాదయా
బలువదరీ దరీకుహరభాస్వదరీ యదరీదరీహరీ.

ఉ. తంత్రులులేని వీణయును దానమురాగము లేనిగీతముల్
మంత్రములేని సంధ్యయును మానములేనితపంబు వేదవి

ట్రంత్రములేని యాగముఁ బదజ్ఞతలేని కవిత్వతత్త్వముం
మ త్రులులేనిరాజ్యము సమానములియ్యవి మున్ప్రయుక్తముల్.

ఉ. గంధవుఁజెట్లకింక నురగంబుపయోనిధి బాడబాగ్నినూ
కందఫలంబు క్రిదనొక కందురుదుంప జగద్విలోగనా
నందము మేఘుఁడుండుఁ బనినాచిరమూడ్కి- నకారణంబుగా
నుందురువారిసన్నిధి నయోగ్యులుకొందఱు మల్లికార్జునా!

ఉ. చూతపలావతంస! ననుఁజూచితిఁ గన్నులపండువయ్యె! లో
పాతిశయంబునన్ బరిమళాస్పతమయ్యె దిగంతమెల్ల వి
ఖ్యాతియొనర్చె నీగుణములైనను గల్లరునానెమ్మదిన్
గాతునగ మెప్పు నీ హృదయకర్కశభావముఁ జూచిపోవఁ గన్.

— శృంగారము —

'శా. పుష్పాల్యాప్తి సరోజబాణముల నంభోజారి నుపాయులన్
భావంబెంతయుఁ కెస్స మేనుపడలేక దాపంబు రెట్టించె నీ
నీవాఁడన్ మధురాధరం బానంగవే సిక్కంబునన్నేలవే
రావేమానిని! కావవేతరుణి సంరక్షించు చంద్రాననా!'

°. మృదుతల్పంబు వికారలీలఁబెగి ధమ్మిల్లంబు చేఁజూచి రా
గదదృగ్జాలములోడఁ గానునలియంగా మోముమార్చ్చుచున్
వదలంబాఱిన వీఁబ్లుగొని కన్యారత్నమున్నగె. ద
త్సదనభ్రాజితరత్న దీపకళికాస్తంభంబు క్రీసిడక్.

శా. లోకాలోకపరీతభూభువన మాలోకించువుణ్యుండవో
రాకాచంద్ర! భవత్సమానముఖి మత్ప్రాణేశ్వరిం బాసి నే
నాకందర్ప శరాగ్నికీలంకునై యున్న చందంబు నీ
వేకాంతంబునఁ దెల్పవయ్య! దయతో నేలాలతా తన్వికిన్.

సీ. పరిణామమేమయ్య! ప్రాణనాథునివాని
విఁ మనోయనియుండుఁ జాదమామ!

విరహాగ్నిచల్లగా విభునియాకారంబు
కందునోయనియుందుఁ జందమామ!
పతికాకుఁజుట్టిచ్చి మతికాంక్షదీరంగ
నుందునోయనియుందుఁ జందమామ

గీ. చక్కదనమున నీసరిచందమామ
యాత దున్నట్టియూరిప్పె నయ్య! మీరు
పోతిరా! నాదువివరంబు పొనఁగఁజెప్పి
సాహసాంకుని రమ్మను చందమామ.'

'ఉ. నారలుకట్టి కూరలనెనంబుగ నుగ్రవనంబులో విప
ద్భారముఁనొంది వందురిన ఫల్గును నుజ్జ్వలరాజ్యవైభవో
దారులమై కనుంగొనిముదంబును గొందఁగఁగాంచుకంటి నిం
పారఁగ నొందుగల్గునె కృతార్థతయెందును గౌరవేశ్వరా!'

సమాప్తము.

శ్రీ చింతామణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.